# ఆఖరి ప్రేమలేఖ



సత్యం శంకరమంచి

నవీన గ్రంథమాల

విజయవాడ-2.

ఇదంతా
ఆవిడది
నేనెవణ్ణి
ఇవ్వడానికి

# అనుబంధం

"ఇవేళటితో నా జీవితం అయిపోయింది. నేను నా సర్వస్వాన్ని పోగొట్టుకున్నాను. నువ్వు హాయిగా వుండు. నా ప్రేమ విఫలమైన తర్వాత యింక బతక లేను. బ్రతికి ప్రయోజనం లేదు....శలవు."

ఇలాటి వుత్తరాలు వ్రాసి - యింటియింటి యిలాటివి నిజంగా విశ్వసించి ఆత్మహత్యలు చేసుకున్నవాళ్ళని నేను చాల మందిని ఎరుగుదును. నిజానికి ఈ సంవత్సరం నేను ఎరుగున్న యువకులలో అయిదారుగురు యీ విధమైన కారణాలవల్ల చనిపోయినవాళ్ళు.

మనం యిలాంటి కథలు చాల చదువుతున్నాం. చాలా యిలాంటి సినిమాలు చూస్తున్నాం. అందులో యెవరో ఒకరు తప్పకుండా నిండు యవ్వనంలో తమ భవిష్యత్తుని నాశనం చేసుకుని ఏదో ఒక తీవ్ర ఆవేశంలో ఆత్మహత్య చేసుకుంటారు.

ప్రేమించటం తప్పుకాదు. సరికదా అది మనుష్యులకు సహజం. కాని ప్రేమ - త్యాగం - వీటి అర్థాలు యిప్పటి యువతీయువకులకు సరిగ్గా, స్పష్టంగా బోధపరచటం అవసరమనిపిస్తున్నది. వాళ్ళందరికీ ఓర్పు సహనం అలవర్చుకోవాలి. ప్రేమ గొప్పదే. కాని జీవితం అంతకన్న గొప్పది.

జీవితం అనుభవాలకోసం మనకు దొరికిన సాధనం. ఇందులో సుఖాన్ని, దుఃఖాన్నికూడ అనుభవించటం జీవించేవాడు చెయ్యవలసిన పని. ఏదో ఒకరకమైన అనుభవాన్నే కోరుకుని అందుకు భిన్నమైన అనుభవాలు వస్తుంటే వాటిని భరించలేను అనటం కాదు - అవివేకం. ఎందుకు వివేకహీనం అంటే—ఆత్మహత్య చేసుకోవటానికి నూరింతలుగా చాలా పనులకంటె ఎక్కువ ధైర్యం కావాలి కాబట్టి. జీవితంలో వచ్చే అనేక అనుభవాలలో ప్రణయం ఒక అనుభవం మాత్రమే. దానితో ఆపేసి - మిగతా ఎన్నో అనుభవాల సంపద అయిన భవిష్యత్తుతో తెగ తెంపులు చేసుకోవటం తొందరపాటువల్ల జరిగిన పొరపాటు అనక తప్పదు.

భగవంతుడిలోనూ, పునర్జన్మలోనూ నమ్మకం వున్నవాళ్ళకి ఆత్మహత్యవల్ల ప్రయోజనం కలగదని నమ్మకం కుదరటం తేలిక. కాని ఆ నమ్మకాలేమీ లేకపోయినా ఆత్మహత్య అనవసరం అని బోధపడాలి.

జీవితంలో వ్యక్తి అనుభవ పరంపరలవల్ల వికసిస్తాడు. ప్రతి అనుభవమూ ఒక క్రొత్త వికాసాన్ని కలిగించేట్లు చేసుకోవటం జీవించే వాడికి ప్రధానకర్తవ్యం. దొంగలు, దుర్మార్గులు, హంతకులు, మోసగాళ్ళు కూడా బ్రతికే వుండాలి. ఎంతఘోరమైన పాపంకూడా మనుష్యుడు జీవించే అవసరాన్ని పోగొట్టుకోడు. నిజానికి తప్పు చేశాననుకొనేవాడు ఆ తప్పును తెలుసుకుని మంచిదారిలోపడే అవకాశం కోసం యింకా ఎక్కువ కాలం బ్రతకాల్సిన అవసరంవుంది. భక్తికి, వైరాగ్యానికి కూడా జీవితంలో చోటువుంది. వాటివల్ల ఒక విలక్షణమైన అనుభవమూ, ప్రయోజనమూ వున్నాయి. పోనీ - మంచీ, చెడూ అన్నీ మనుష్య దృష్టివల్లనే అనుకున్నా చెడువల్లనైనా మనుష్యవ్యక్తిత్వ వికాసం కలగాలి. అందుకు సాధనంగా ఉపకరించేవన్నీ చివరకి "మంచి" గానే పరిగణించవచ్చు

లోకంలో మనుష్యులంతా ఆవేశాలున్నవారే. అయినా కేవలం ఆవేశానికి పూర్తిగా దాసులు కారు. సాధ్యమైనంతవరకూ ఆవేశాలని అదుపులో పెట్టుకోవటం మనుష్యలక్షణం. ఆవేశాలకు ఎలాపడితే అలా లొంగిపోవటం చంటిపిల్లలకూ, పిచ్చివాళ్ళకూ తగును. కాని చాలా తెలుగు నవలలో పాత్రలు ఏందుకు లేశమైనా Res'raint కాని కనీసం అందుకోసం ప్రయత్నంకాని లేకుండా ప్రవర్తిస్తారో నాకు బోధపడదు. జీవితంలో ఏమాత్రం జ్ఞానం వున్నవాళ్ళయినా ఆయా సందర్భాలలో యింకా కొంత నిగ్రహంతో ప్రవర్తిస్తారని చెప్పటానికి వీలయిన సంఘటనలు అనేకం యీ మధ్యవచ్చిన తెలుగు నవలలో వున్నాయి. ఆవేశం అవధులు దాటి నిగ్రహించుకోవటానికి సామాన్యునికి వీలులేని స్థితివేరు. అసలు నిగ్రహంకాని, తత్ప్రయత్నం కాని లేకపోవటంవేరు. ఈ రెండవస్థితి మన నవలలో, సినిమాలలో ఎక్కువ కన్పిస్తున్నదనే నా మనవి.

తెలుగునవలలు ఇంకాహా పైన చెప్పబడిన ఉన్నతప్రయత్నాన్ని చేసినా చెయ్యకపోయినా అందులోని పాత్రలు కనీసం మనుష్య సహజమైన హుందా, నిగ్రహంలేకుండా పసిపిల్లలాగా ప్రవర్తించటం చూస్తే అమాయకులైన పఠించేవాళ్ళకి యివి గొప్పనవలలు కాబోలుననే భావం కలుగుతుందని భయం వేస్తున్నది!

సత్యం శంకరమంచి - యీ దృష్ట్యా చూస్తే - చాలా ఆహ్లాదకరమైన కొత్తపని చేశారు. ఈయన "సీత స్వగతాలు," "ఆఖరి ప్రేమ లేఖ" - యీ రెండునవలలలోనూ Positive outlook స్పష్టంగా Fresh గా కన్పిస్తుంది. నిరాశలతో, ఆత్మహత్యలతో విసుగెత్తిపోయిన నవలా పాఠకులకు కొత్త వెచ్చదనం దొరుకుతుంది యీయన నవలల్లో.

ఈయన పాత్రలు ఎంతో హుందాగానూ, సాధ్యమైనంత నిగ్రహం తోటి ప్రవర్తిస్తాయి. అన్నిటికన్నా విశేషం - మనుష్య సహజమైన మార్పుని ఈయన ధైర్యంగా పాత్రలచేత అంగీకరింపచెయ్యటం.

'సీత స్వగతం'లో సీత రాజు తనని కావన్నాడని బాధపడినా అంతకు తక్కువని, సాంప్రదాయకంగా కథలలోలాగా జీవితమంతా నిరాశలతోటి నిప్పిపోవటమో, లేకపోతే చచ్చిపోవటమో చెయ్యకుండా, జీవితాన్ని Accept చేస్తుంది. మనస్సుయొక్క సహజ ప్రవృత్తిని, కృతకమైన విచారభారంతో లొంగదియ్యకుండా ధైర్యంగా వాళ్ళలో మార్పు చూపిస్తాడు రచయిత.

'ఆఖరి ప్రేమలేఖ' లో కూడా యింతే. రామం ప్రాణంకన్న మిక్కుటంగా ఆ అమ్మాయిని ప్రేమించి, తన ప్రేమ విఫలమైపోయిన తర్వాత చచ్చిపోవాలనుకుంటాడు. మరణ ప్రయత్నానికి ముందు తన గత జీవితాన్ని ఆమెకు ఉత్తరం రాస్తూ జ్ఞప్తికి తెచ్చుకుంటూండగా - ఆ అమ్మాయి చాలా స్వార్థంతో ప్రవర్తించిందనే ఊహ వస్తుంది రామానికి.

రామం బ్రతకటానికి - ఆ అమ్మాయి ప్రవర్తనమీదల ద్వేషం కాకపోయినా - అనిష్టం - తమాషాగా దోహదం చేస్తుంది. ద్వేషంవల్ల కూడ అల్పపరిధిలో కొన్ని ప్రయోజనాలున్నాయని అనిపిస్తుంది మనకి. ఒక స్థితిలో గాఢంగా ప్రేమించినవాడు ప్రేమవిఫలమైన తర్వాత నిలవటానికి, చిరుద్వేషం - రోగిని బ్రతికించే విషంలా పనికివస్తుంది. కాని, సర్వత్రా ఈ ద్వేషం ప్రయోగించవచ్చనలేను. ద్వేషరహితంగా కూడా ఈ ప్రయోజనాన్ని సాధించవచ్చు ననుకుంటాను. అయినా రచయిత ఈ నవలలో రామానికి ఈ విధమైన Disillusionment తీసుకురావటం ఆవశ్యకమైన మార్పు అవుతుందని భావించారు. తద్భిన్నమైన మార్పు మరీ మేధాగతం అయి, నవలకు అందనిపోయే ప్రమాదం వుంది అప్పుడది నవల కాకుండా థీసిస్ అయిపోవచ్చునని రచయిత భయంలా వుంది.

ఏది ఎట్లా అయినా రామం పాత్రలో ప్రధానమైన చివరిమార్పు రావటానికి ఈ Disillusionment ఎన్న గొప్పదైన, బలమైన సన్నివేశాన్ని ఏర్పరచటం రచయిత చేసిన చాల మంచిపని. భవిష్యత్తుకీ,

లకి. ఆవేశానికి. త్యాగానికీ. బ్రతుకుకీ. ఆనందానికీ - ఒక్కమాటలో మానవ ప్రవృత్తిలోని సౌందర్యానికంతటికీ పరమావధి నూతన శిశువు. అప్పుడే ప్రపంచంలోకివచ్చి "క్యార్" మనే అరుపులో "నేనువచ్చాను", అని గంభీరంగా ప్రకటించిన పసిపిల్లాడి గొంతుక కథానాయకునికి, కథకీ, చదివేవాళ్ళకీ కొత్తలోకాన్ని చూపిస్తుంది. బ్రతుకు ప్రణయంతో ముగిసిపోదని - ప్రణయంతో ఆరంభమౌతుందని పాఠం చెబుతుంది పిల్లవాడి ఏడుపు.

ఈ కథ ముగియడంతో హాయిగా, కన్నీళ్ళు వొచ్చి, సముద్రపు టంచువద్దనుంచి వచ్చిన చల్లగాలి లాగ మనసు తేలికపడుతుంది.

ఈ నవలలు ఉత్తమమైన నవలలు అవునో కాదో తేల్చేపని నాది కాదు. వేలాది పాఠకులది — వారి తరువాత వచ్చే కాలానిదీ.

కాని యివి కొత్తదారి అని, ఆశనీ, ప్రవృత్తినీ ప్రతిపాదించే ఆరోగ్యకరమైన మార్గమని, యివి ఎప్పటికన్నా కూడా ఇప్పుడు తెలుగు యువతీయువకులకు అవసరమని నా నమ్మకం. అందువని యివి మంచి పని నా విశ్వాసం.

*　*　*　*　*

బ్రతకటమా ? చావటమా ? అనేది ఒక్కటే తాత్త్విక సమస్య మిగతావేవీ తాత్త్విక సమస్యలు కావన్నాడు ఆల్బర్ట్ కామూ 'మిత్ ఆఫ్ సిసిఫస్' అనే పుస్తకంలో.

నిజమే. "To be or not to be" అన్నది ఒక్కటే ప్రశ్న. దానికి సమాధానం అక్కర్లేనివాళ్ళు అసలు ఆ ప్రశ్నే వుదయించని వారూ వేరు. కాని ఈ ప్రశ్నతో మథనపడేవాళ్ళు అంతకన్న ఎక్కువ Awareness వున్నవాళ్ళని మాత్రం ఒప్పుకోవాలి. వాళ్ళ చర్యల మీదే మనుష్యలోకపు మంచిపనులు ఆధారపడి వున్నాయి. వాళ్ళ ప్రశ్నకి సమాధానం దొరకటం అందుచేత అవసరం.

ఇది ప్రముఖంగా ఆత్మగతమైన ప్రశ్న అనీ, ఎవరి ప్రశ్నకి వాళ్ళు సమాధానం చెప్పుకోవాలనీ, ఒకరు తిన్న అన్నం మరొకరు జీర్ణం చేసుకోలేనట్లే, ఒకరి సమస్యని యింకొకరు తీర్చలేరనీ తెలుసు. కాని ఆ సమస్యని కొంత నిష్పక్షతత్వంతోనైనా చర్చించటం ఉపకారకం కాక పోదనే ఆశవుంది. అందుకనే ఈ చర్చ.

వేల్చేరు నారాయణరావు—

# ఆఖరి ప్రేమలేఖ

సుశీలనే అమ్మాయికి- ఇది నీకు నేను రాసే ఉత్తరాల్లో చివరిది. నీకేకాదు ఈ ప్రపంచంలో ఇంకెవరికీ కూడా రాయ బోవటం లేదు.

అంతేకాదు. ఈ ప్రపంచంలో నేను ఇంకేపనీ చెయ్య బోవటం లేదు ఈ ఉత్తరం రాశాక. ఇదే నా జీవితం ఆఖరున నేను నిర్వర్తించే కార్యం! ఎన్నడన్నా అనుకున్నానా, నా ఆఖరి క్షణాలు నీకు ఉత్తరం రాస్తూ గడుపుతానని. నేననుకున్నానూ, నేను కనీసం డెభ్భై ఏళ్ళదాకా బతుకుతాను. నా సుశీల వృద్ధురాలై పోతుందీ, చుట్టూ కొడుకులూ, కోడళ్ళూ, మనవలూ భూదేవిలా ఉంటుందీ. వాళ్ళ చదువులూ సంసారాలూ చక్కదిద్దుతూ ఇంటికంతటికీ సూత్రమై, వాడకంతటికీ పెద్ద ముత్తైదువై వెలుగుతుందీ- అని ఎన్నను కొన్నాను! నే నీ లోకాన్ని విడిచి పెట్టే సమయంలో నా మంచంచుట్టు నువ్వూ, కొడుకులూ, కోడళ్ళూ, మనవలూ అంతా ఉంటారనీ, మిమ్మల్నందర్నీ నేను ఆఖరిసారి పరిశీలనగా చూస్తానని, మనవళ్ని జాగ్రత్తగా చూడ

మని కొడుకులకి చెప్తాననీ, 'నాయనా! అమ్మ జాగ్రత్త!' అని నిన్ను అబ్బాయిలకి అప్పగిస్తానని. ఒక్కసారి నీ వైపు చూసి శలవు తీసికొంటానని, నీ కళ్ళలో నీళ్ళు తిరిగినప్పుడు నేను నవ్వుగా నవ్వుతానని, అందులో భయంలేదు. భగవంతుడు మేలుచేస్తే మళ్ళీ కలుస్తాం అన్న ఓదార్పు ఉంటుందని, ఆలోకంలో నీకోసం ఎదురుచూస్తూ ఉంటానని చెప్పి హాయిగా కళ్ళుమూస్తాననీ– ఎంతో ఊహించుకున్నాను.

కాని మనుషుల ఊహలు, కోరికలు అన్నీ జరిగితే చిత్రం ఏముంది? జీవితంలో ఏం జరగబోతోందో నీకు ముందే తెలిస్తే అసలు అందమే లేదేమో! నీవు ఆశించనిది అకస్మాత్తుగా మీద పడి, తప్పకుండా జరుగుతుంది అనుకున్నది మధ్యలోనే తెగిపోయి ఆశ, నిరాశ, బాధ సంతోషం వీటిల్లో మెలితిరిగి పోతూ, అనుకోనివీ, అనుకొన్నవీ అన్నీ కలగలిసి, జీవనగతిని తిప్పేస్తుంటే అందులోపడి పరుగెత్తటమేగా మనిషి చేసేది!

నీ సాహచర్యంలో తలపండి ఈ జీవితాన్ని ముగిద్దామని ఆశలు పెట్టుకున్నాను. కాని నా దురదృష్టమో ఏమో నీవు నా నుంచి విడిపోతావని, ఇంకొకరి జీవితంలో భాగస్వామిని వవుతావని నే నెన్నడూ అనుకోలేదు. ఏనాడు ఆ బాట మొదట్లోనే నన్ను విడిచి వెళ్ళిపోయావో, ఆ క్షణాన్నే అనుకున్నాను నే నీ ప్రపంచాన్ని విడిచివెళ్ళక తప్పదని. నా యీ నిర్ణయం దౌర్బల్యంతో కూడినదిగా నీకు కన్పించవచ్చు. లేకపోతే నీమీద కసి

కొద్ది నేనీపని చేస్తున్నాననుకోవచ్చు. నిజం చెప్తున్నాను. నీమీద నాకు కోపంలేదు. కాని సుశీలా! నువ్వు నన్ను పిరికివాడుగా భావిస్తే అందులో కొంతనిజం ఉందేమో! కాని ఒక్కసంగతి! నేను ఒంటరిగా ఈగుండె గాయాలతో, చెట్లూ, పువ్వులూ, పిల్లలూ నా ఒంటరితనంచూసి నవ్వుతుంటే, ఈ ఎడారి ప్రయాణం నేను చేయలేను. ఆబాధ నాకు తలుచుకుంటేనే దుస్సహంగా ఉంది. అలాంటి పరిస్థితుల్లో నీనుంచి, ఈ లోకంనుంచి శలవు తీసికొని వెళ్ళిపోవటం పిరికితనమా? నువ్వేమన్నా అను! ఆ నిర్ణయాన్ని న్యాయం, అన్యాయం, సమంజసం అసమంజసం మొదలైన ప్రమాణాలతో కొలవడం నా కిష్టంలేదు. అది అవసరం, తప్పనిసరి, ఆపద్ధర్మం– ఎందుచేతో నా కొక్కడికే అర్థమవుతోంది. నువ్వు కొంచెం తాపీగా నాకళ్ళు పెట్టుకుచూసి, నా మనస్సుతో ఆలోచిస్తే నీకూ అర్థంకాకపోదు.

నువ్వు ఈ ఉత్తరం సాంతం చదువుతావుగా!, ఇదిసాంతం చదవటానికి కొంత ఓపికకావాలి నిజం! విసుగు పుడుతుంది. ఇంటికి వెల్లవేసి మంగళ తోరణాలుకట్టి నిన్ను పెళ్ళికూతుర్ని చేస్తున్న ఈ సమయంలో నువ్వు ఈ నాఘోషఅంతా చదివితే, నామీద నీకు జుగుప్స కలగొచ్చు, అసహ్యం వేయొచ్చు. కాని సుశీలా! నిన్ను కోరుకుంటున్నాను. ఈ ఉత్తరం సాంతంగా చదవ్వా? మధ్యలో ఆపకుండా చివరిదాకా చదువుతానని మాట ఇన్వవూ? నిన్ను కష్టపెట్టే కోరికే కోరుకుంటున్నాను, పోనీ! కొన్ని క్షణాల్లో నశించబోతున్న ఈ నిర్భాగ్యుడిమీద జాలి

పడైనా నా కోరిక మన్నించవూ? నేను వెళ్ళిపోతున్నా ఈఉత్తరంలో నా ప్రాణం ఉంది సుశీలా! నా ఆశలు, నా బాధలు, నా నీచత్వం, నా తెగిపోయిన పూలమాలలు, నాగాథ, నా ఊపిరి అంతా ఈ ఉత్తరం. దీన్ని నువ్వు సొంతం చదివితే అర్ధాంతరంగా ముగిసిన నా బ్రతుక్కొక అర్థం. నా ఆత్మకు శాంతి.

నిన్ను పెళ్ళికూతుర్ని చేస్తున్నారా సుశీ? నీ కాళ్ళకి పసుపురాసి పారాణి పెడ్తున్నారా? నా కెప్పుడో వెనకోసారి కల వచ్చింది నీచిట్టి పారాణి పాదాల్ని ముద్దుపెట్టుకొన్నట్టు. నిన్ను ఆ మర్నాడు అడిగాను జ్ఞాపకం ఉందా— నీ పాదాలకి పారాణి పెట్టుకుంటే చూడ్డామని ఉందని. నువ్వు 'చూడాలనుందా?' అన్నావు నేను అవునన్నట్టు తలూపాను. అప్పట్లో నా కోరిక తీర్చటం నీ కెంత సరదా! కోరిందే చాలు అన్నట్టుండేదానివి కదూ! పారాణి ఎందుకు గోరింటాకు పెట్టుకుంటాను నాలుగు రోజులుంటుంది అన్నావు. ఆ మర్నాటినుంచి సింధూరం పండి నట్లు, నీ రోజా పాదాలచుట్టూ గోరింటాకు ఎర్రగా వెలుగుతుంటే, ఆ చిన్ని పాదాల్ని, వేళ్ళని గోళ్ళని అదేపనిగా చూసే వాణ్ణి. నా కప్పుడే అనిపించింది నిన్ను పెళ్ళికూతుర్లా చూడాలని. నువ్వు పెళపెళలాడే పట్టుచీర కట్టుకుని, నుదుటిమీద చంద్రవంకలా కల్యాణతిలకం పెట్టుకుని, బుగ్గన వెక్కిరింపుగా చామ చుక్క అద్దుకుని వెనక పూలజెడ భారంగా కదుల్తుంటే బరువుగా అడుగులేసుకుంటూ వచ్చి నాపక్క పీటమీద ఒదిగి కూర్చుని చెంప మోకాలికి చేర్చి నువ్వు నేల చూస్తుంటే, నేను కొంచెం

పక్కగా క్రీగంట నిన్నుచూసి- సరే వొదిలెయ్. ఆ ఆలోచన ఇప్పుడు రాకూడదు.

మీ దొడ్డినిండా పందిరి వేసిఉంటారు. పందిరి పారిజాతం చెట్టుని మూసెయ్యలేరుగదా! నీకు అత్తవారు ఇప్పుడే చాలా నగలు పెట్టారుట! నన్ను ఆపెళ్ళి అలంకారాల్తో ప్రత్యక్షంగా చూడకపోయినా, ఊహించుకోగలను. కొత్త చీరె లేవైనా కొనుక్కున్నావా? నీకిష్టమైన లేత నీలం పట్టుచీర తప్పకుండా కొని ఉంటావు. దానిమీద ముఖమల్ జాకెట్ అంత బావుండదయ్యా! సరే నీఇష్టం అదే వేసుకో. ఇదివరలా అన్నింటికీ నీమాటే నెగ్గాలని మొండికెయ్యకేం. సర్దుకుపోవడం నేర్చుకోవాలి. సుశీ! నీకు రోజూ రాత్రిపూట పారిజాతాలు కావాలంటే ఇంకెలా వస్తాయి? నేను రోజూ సాయంత్రం నీదగ్గరికి వచ్చినప్పుడు, ఆకబుర్లూ ఈకబుర్లూ చెప్పుకుని తిరిగి వచ్చేస్తుంటే, అప్పుడడిగేదానివి పారిజాతంపూలు కోసిపెట్టమని. నాకు లోపల విసుగేసేది. ఒకోసారి కోపమొచ్చేది. చీకటిపడ్డాక వేధించకపోతే వెల్తున్నప్పుడు అడక్కూడదా! అని చిరాకు పడేవాణ్ణి. నీకెప్పుడూ పొద్దుగూకింతర్వాత చీకట్లో పారిజాతాలు గుప్పుమంటేగాని జ్ఞాపకం వచ్చేదికాదు. పువ్వులు కోసివ్వటానికైతే బద్ధకించేవాణ్ణిగాని, కోసిచ్చింతర్వాత వాటిని నువ్వు ఒళ్ళో పోసుకుని దండ గుచ్చుతుంటే నాకు వెళ్ళబుద్ధయ్యేదికాదు. అట్లాగే చూస్తూ కూర్చునేవాణ్ణి. నువ్వు సూదిని వేళ్ళసందున పట్టుకోవటం, దారాన్ని పొడుగ్గా

లాగి చటుక్కున సూదిలోకిఎక్కించెయ్యటం, గబగబా సూదిలో పువ్వులుగుచ్చి దారాన్ని సర్దుతూ లోలాకులమాల అల్లుతుంటే అదంతా నాకు తెలియని విద్యలా విచిత్రంగా ఉండేది. మాల గుచ్చుతూ నువ్వు తలెత్తి తదేకంగా చూస్తున్న నన్నుచూసి నవ్వేదానివి. మళ్ళీ తలొంచుకుని మాలఅల్లేదానివి. మధ్య మధ్య తల పైకెత్తి నవ్వుతూ, మాల అల్లుతూ ఉన్న నిన్ను చూస్తూ నేను కాలం మర్చిపొయ్యేవాణ్ణి. నాలుగుపూలు మిగిల్చి దండ పూర్తిచేసి 'ఇదిగో నీపూలు' అని ఆ నాలుగు పువ్వులు నా కిచ్చేదానివి. ఇట్లా ఇవ్వటం మొదలెట్టిన మొట్ట మొదటిరోజు ఏం జరిగిందో నీకు జ్ఞాపకముందా? 'ఇదుగో ఈ నాలుగుపూలు నువ్వుంచుకో' అన్నావు.

'నా కక్కర్లేదు నేనేం ఆడపిల్లని కాదు.' అన్నాను.

నువ్వు ఆమాటకి ఆశ్చర్యపోయినట్లు చూసి 'నీకు పువ్వులంటే ఇష్టంలేదా?' అన్నావు.

నాకు నిజంగా పువ్వులంటే ఎంత ఇష్టమో చెప్పటానికి అది సమయంకాదు. నేను మౌనం పట్టాను.

'కష్టపడి పువ్వులు కోశావుకదా! ఇదుగో తీసుకో' అన్నావు.

నేను మాట్లాడకుండా పువ్వులు అందుకుని ఒకసారి వాసనచూచి 'నువ్వు తల్లో పెట్టుకున్న చెండులోవి నాలుగు పూలు తీసిస్తే మరీ బాగుంటుంది' అన్నాను.

'ఆహా! అట్లాగా!' అన్నావు. అసలు అదొక సమాధానమా! కాస్సేపు నీ పెదవులమీద చెరగకుండా చురకత్తి లాంటి చిరునవ్వు.

ఆరోజునుంచి నువ్వు దండ గుచ్చుకుని మిగిలిన నాలుగు పూలు ఎప్పుడు నాచేతిలో పెడ్తావా అని ఎదురు చూసేవాణ్ణి. ఒకరోజెందుకో నేను తొందరపనిమీద వెళ్ళాల్సివచ్చింది. నువ్వు తీరిగ్గా మాల అల్లుతున్నావు. అవతల నాకు టైం అయిపోతోంది. 'ఈ నాలుగు పువ్వులూ తీసికెళ్ళు' అన్నావు నువ్వు.

'నువ్వు దండ సొంతం గుచ్చుకుని తల్లో పెట్టుకుని, మిగిలిన పువ్వులివ్వాలి' అన్నాను నేను.

'అయితే మాల అయ్యేదాకా ఉండు' అన్నావు నీవు.

'ఉంటున్నాలే. త్వరగా కానీ' అని అటూఇటూ తిరుగుతున్నాను. నాకు టైం అయిపోతోంది. 'ఇంకెంతసేపు ఈరోజుల్లా అల్లేట్టున్నావు' అని విసుక్కున్నాను.

నువ్వు మాలకట్టటం ఆపేసి 'అట్లాఅయితే అసలకట్టను' అన్నావు.

'ఏం నాకోసం కట్టుకుంటావా?' కోపంగా అన్నాను.

'నాకోసమే కట్టుకుంటున్నాను. నా ఇష్టమొచ్చినంతసేపు తీరిగ్గా కట్టుకుంటాను' నువ్వు రోషంగా అన్నావు.

నాకు చెడ్డ కోపమొచ్చింది 'అయితే కట్టుకో. నాకు నీ పువ్వులు అసలు అక్కర్లేదు' అని పుసుపుస వెళ్ళిపోయాను.

నేను ఏపనికోసమైతే తొందరపడి వెళ్ళానో ఆపనికా లేదు. సాయంత్రం పువ్వుల దగ్గిర మన పోట్లాట జ్ఞాపకం వచ్చింది. రూమ్‌కి పోవడానికి మనసొప్పలేదు. సరాసరి నీదగ్గిరకొచ్చాను. నువ్వు నీగదిలో కూర్చుని చదువుకుంటున్నావు. నా అడుగులు చప్పుడుకే లేచి నాకెదురు వచ్చావు. నువ్వు నాకోసమే ఎదురు చూస్తున్నట్లనిపించింది. ఇద్దరమూ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా నవ్వాం. 'పువ్వులు కావాలా' అన్నావునువ్వు. నేను అవునన్నట్లు తలూపాను. నువ్వు చటుక్కున జడలోంచి చెండు తీసి సగానికి తుంచి నాకిచ్చినావు. నేను రెండు చేతుల్తో అందుకుని తిరిగి వచ్చేశాను.

ఆ మర్నాటినుంచే కదూ మనం ఒకళ్ళకొకళ్ళం ఎక్కువ కావలసిన వాళ్ళం అయ్యాం!

ఇంక, నాకు రోజూ అలవాటుగా ఎవరు పువ్వులిస్తారు? నీ చేతిమీదంచి పారిజాతాలు అందుకోకుండా నే నెలా నిద్ర పోతాను? శేఖరానికి పువ్వులంటే అంత ఇష్టం ఉందో లేదో! అతను పువ్వుల్ని చూసి నీ అంతగా పొంగి పోలేకపోతే! 'చేతి మీదంచి పువ్వు లందుకోవాలని ఆరాట పడకపోతే, నీ ఊహలో, మనసులో, చూపులో, పలుకులో పువ్వుల్ని చూడలేకపోతేబాధ పడకేం! సర్దుకుని నచ్చచెప్పుకుంటావుగా! ఇలాంటి చిన్నచిన్న

విషయాలకి నువ్వు మనసుకష్టపెట్టుకుంటే నేను చూడలేనమ్మా! శేఖరం మంచివాడు. జీవితమంతా అతని పక్క అందంగా హాయిగా నడవాలి!

కళ్ళలో నీళ్లు తిరిగినాయి. అందుకని ఉత్తరం రాయటం కాసేపు ఆపాను.

రెండు సిగరెట్లు వెంట వెంట కాల్చాను. కప్పు టీ తాగాను. నాకేమిటో ఈ రాత్రి గబగబా అయిపోతున్నట్లుంది. నాకీ ఉత్తరం గబగబా రాసి ముగించెయ్యాలని ఉంది. అందుకని టీ తాగుతున్నా సిగరెట్ కాలుస్తున్నా ఒక తొందర హడావుడి, రైలు ప్రయాణం చేయబోతున్నవాళ్ళు చకచకా అన్నీ సర్దేసుకుంటున్నట్లు నా ప్రయాణం దగ్గర పడుతోంది. నా ఎదురగా అలారం టైంపీస్ గంటలు గంటలు దాటిపోతోంది. నాకు భయం! ఈ రాత్రిలోగా అన్నీ ముగించుకోగలనో లేదోనని. నాకింకేమున్నాయి ఈ లోకంలో నిర్వహించవలసిన కార్యాలు ఈ ఒక్క ఉత్తరం తప్ప. ఈ ఉత్తరం ఈ రాత్రే పూర్తవ్వాలి. నేను సూర్యోదయం చూడకూడదు. ప్రత్యూషంలోని ప్రశాంతత భయం, ఉదయ సూర్యకిరణాలు చల్లగా భూమిని తాకుతున్నప్పుడు భయం, హాయిగా నిద్రపోయి ఉల్లాసంగా లేస్తున్న మనుషులు, నవ్వులు, కేరింతలు - భయం! భయం!

నా వూహలు, భావాలు ఒక క్రమంలో రావటం లేదు. ఒకదానిలో కొకటి చొచ్చుకుపోవడం, గబగబా తోసుకు

పోవటం, సగంలో విరిగిపోవటం. అందుచేత ఈ ఉత్తరం ఒక క్రమపద్ధతిలో ఉండకపోవచ్చు. నేను చెప్పదలచుకున్నది స్పష్టంగా చెప్పలేకపోవచ్చు. ఈ చెల్లాచెదరైన పూసల్ని గుచ్చి దండ గుచ్చుకోగలవుగా! కొంచెం సేపట్లో వరించబోయే నా జీవితానికి క్రమమేమిటి, ఒక పద్ధతేముంటుంది? అస్తమించబోతున్నవాడి బతుక్కి అర్థం కూడానా? కాని సూర్యుడస్తమించటానికి అర్థం ఉంది, అందం ఉంది. నేను సూర్యుణ్ణి కాదనుకో. అయినా సూర్యుడు మళ్ళీ రేపు ఉదయించాలి. నేను కాదు.

నేను ఆత్మహత్య చేసుకోబోతున్న విషయం మళ్ళీమళ్ళీ చెప్తున్నాకదూ! ఎంచేతో అదే మనసులో కదుల్తోంది. ఇది నిన్ను కంగారు పెట్టడానికి మాత్రం కాదు. చావు సహజముగా ఎప్పుడో వస్తుందనుకుంటే దాన్ని గురించి అంతగా పట్టించుకోకపోవచ్చు. కాని మృత్యువు గడప దగ్గర నాకోసం ఎదురు చూస్తున్నప్పుడు అదే పదే పదే జ్ఞాపకం రావటం ఆశ్చర్యం లేదేమో! కోరి మరణించబోతూ మరణం గూర్చిన చింతన ఎందుకో? అదో బలహీనత. భయం మాత్రం కాదు. నేనూ మనిషినేగా! నాకూ కొన్ని బలహీనతలు. కొన్ని బలహీనతలు అందంగా ఉంటాయి. అన్నీ వొదిలేసుకుని ఆశలూ, కాలం, నెప్పులూ, వేదనా అన్నీ నీచుట్టూ అల్లుకుని నిన్నే ఆరాధించటం నాలోని పెద్ద బలహీనత. గొప్ప హాయి. ఆ బలహీనతవల్లనే

నే నీ లోకాన్ని విడిచి వెళ్తున్నానన్న భావం కలిగినప్పుడు నాకు విచారం లేదు. సుఖంగా ఉంటోంది.

చిత్రం చూశావా సుశీ! ఈ రాత్రితో నేను వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నాక నాకేం తోచలేదు. ఒకసారి బజారు వెళ్ళివద్దామనుకొన్నాను. గబగబా బయలుదేరి బయటికివచ్చిన వాణ్ణి తిరిగి లోపలికి వెళ్ళాను. పెట్టెలోంచి ఇస్త్రీ ఫాంటు షర్టు తీసివేసుకున్నాను. రోజూకంటె ఎక్కువసేపు తల దువ్వుకున్నాను. అద్దానికి ఆఖరుమాటగా రేపటినుంచి నాముఖం నాకు చూపించే పని నీకు లేదని చెప్పాను. ముఖం మళ్ళీ మళ్ళీ అద్దంలో చూసుకున్నాను. ఆ అద్దం నేను కాలేజిలో చేరినప్పుడు కొన్నది. నీతో పరిచయం కాకముందునుంచీ నాముఖం దానికి తెలుసు. నీ పరిచయంలో కలిగిన సంకోచాలు, సుఖం, బాధ, నిద్రలేని రాత్రిళ్ళు, సంతోషపుపొంగులు అన్నీ చూసింది ఆ అద్దం. కళ్ళు పెద్దవిచేసి అద్దంలో నా ముఖంలోకి చూసుకున్నాను. అడుగో! రామం... తెల్లటి నీలి కళ్ళు... పొడుగు ముక్కు, ఒత్తయిన పెదవులు, ఉంగరాల జుట్టు... అదుగో! ఆకళ్ళలో నెత్తురు...గొంతులో గాయాలు...దగాపడ్డవాడు... శాపంచేత కూలిపోతున్నవాడు అందరూ ఒంటరినిచేసి పోతే, అసహాయంగా కెవ్వున అరుస్తున్నాడు...- అద్దం టప్పున కింద పడేసి బయటకు పరుగెత్తుకొచ్చాను.

దోవలో సీతారామయ్య 'బావున్నారా?' అని పలకరించాడు. నేను నీట్‌గా డ్రస్ చేసుకున్నానని మంచి మూడ్‌లో

వున్నాననుకున్నాడో లేక నా కళ్ళల్లోని దైన్యాన్ని చూసే పలకరించాడో నేను సమాధానంగా తలూపి ముందుకు నడిచాను. సీతారామయ్య చేతిలో పళ్ళు చూసినట్లు జ్ఞాపకం. పళ్ళంటే నా కెందుకో ఇష్టం. రుచిని గురించికాదు. ఆ సృష్టి తలుచుకున్నకొద్దీ ఎక్కడలేని ఆశ్చర్యం వేస్తుంది. 'పండు'-నిండు బతుకులా, మూర్తీభవించిన సుఖంలా, హాయిలా, మాధుర్యంలా...... సీతారామయ్య భార్యకు పళ్ళంటే ఇష్టం. బహుశా ఆమెకోసమే కాబోలు కొనుక్కొని గబగబా పోతున్నాడు. సీతారామయ్య భార్య- పేరేవిటో ఎప్పుడూ మర్చిపోతూ ఉంటాను. వరలక్ష్మో, మహాలక్ష్మో ఉంది, ఎంతమంచి ఇల్లాలు!

అయ్యరు హోటల్ వచ్చింది. తెలిసిన సర్వర్ నన్ను చూసి దగ్గరికొచ్చాడు. అతనివైపు చూసిందే తడవుగా ఏవో చేంతాడంత చెప్పాడు బీరువాల్నవైపు చూశాను. దానినిండా రంగు రంగుల స్వీట్సు, అన్నీ తినేద్దామనిపించింది. ఏవేవో అన్నీ తెమ్మన్నాను. బల్లనిండా తెచ్చి పరిచాడు. కానీ ఏదీ తినబుద్ది కాలేదు. కొన్ని కొరికాను కొన్ని అలాగే వదిలేశాను. సర్వర్ కాఫీ తెస్తూ కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్య పోతున్నాడు. వెనక్కితిరిగి వెళ్తూ బహుశా నవ్వుకుంటూ కూడా ఉండొచ్చు. బిల్లు తీసి కొని కౌంటర్ దగ్గరికొచ్చాను. అక్కడ అయ్యర్ తమ్ము డున్నాడు. అతనంటే నా కిష్టంలేదు. ఒకసారి మాట పేచీవచ్చి ఇద్దరం ఘర్షణ పడ్డాం. అయినా రేపు ఎలాగూ వెళ్లిపోతున్నాను

వాణ్ణి ఒక్కసారి తన్ని పోదామనిపించింది. ఆ ఆలోచనకి నవ్వు కున్నాను. నా బస్సు కు పుస్తకం ఆఖరవ బోతుంది నాకింకా మనుషులమీద కోపమేవిటి? అనిపించింది. బిల్లు ఐదురూపాయల నోటు కౌంటర్ మీద పెడ్తూ అయ్యర్ తమ్ముణ్ణి పలకరించాను 'బాగున్నారా?' అని. అయ్యర్ తమ్ముడు మొదట కంగారు పడ్డాడు నా ప్రసన్నతకు. అంతలో తేరుకుని మొహమింత చేసి కొని నోరంతా విప్పి 'ఆ' క్షేమమే! మీ ఆరోగ్యం బాగా ఉం డిందా? కొంచెం చిక్కిపోయినారు. మీరు కాఫీదా ఎక్కువ తాగుతురు. కొంత తగ్గించవలె......' అంటూ ఆపకుండా చెప్తున్నాడు. నేను బయటికి వచ్చేస్తుంటే పిలచి చిల్లర ఇవ్వ బోయాడు. వద్దు నా రూంలో ఫ్లాస్కు ఉంది. మీ సర్వర్ కి తెలుసు. అది తెప్పించి కొంచెం టీ పోసి పంపండి అని మెట్లు దిగి వచ్చేశాను.

రోడ్డమ్మట నడుస్తున్నాను. వెనకాల మువ్వలు కదిలించి నట్లు నవ్వు విన్పించింది. వెనక్కి తిరిగి చూశాను. ఓ అమ్మాయి నోటికి చెయ్యి అడ్డంగా పెట్టుకుని ఆపుకోలేక తెరలు తెరలుగా నవ్వుతోంది. ఆ అమ్మాయి కనుబొమ్మలు తీరుగా ఉన్నాయి. చెక్కిళ్ళలో ఎరుపు. పక్కనే ఒకతను తనూ నవ్వుతూ ఆమె ముఖంలోకి, ఆ నవ్వుతున్న పెదవుల్లోకి చూస్తున్నాడు. నేను చూస్తున్నానని కాబోలు వాళ్లిద్దరూ నవ్వులు ఆపేసి నడుస్తూ పోయారు. నాకూ నవ్వుకోవాలనిపించింది. కాని గుండెలో ముల్లు కలుక్కు మంది. ఆ కోర్కె విడిచి చరచరా వెళ్ళిపోయాను.

పార్కు. పార్కులో పిల్లలు. పరుగులు, పరుగుల్లో నవ్వులు, కింద పడుతున్నారు ఒళ్ళు దులుపుకుంటున్నారు. కేకలు హాయిగా సంతోషంగా బతుకంతా మాదే నన్నట్టు. జంటలు, ఆడా మగా ఒద్దిగ్గా ఒకళ్ళ పక్క నొకళ్లు నడుస్తున్నారు. కళ్ళతో నవ్వులంది పుచ్చుకుంటూ మాటల్ని మనసుల్ని ఆస్వాదించుకుంటూ కలబోసికొంటూ కలిసిపోతూ దగ్గిర దగ్గిరగా ఆనుకొని నడుస్తు న్నారు. చుట్టూ పూలచెట్లు పూలచెట్ల చుట్టూ రంగు రంగుల క్రొత్త చీరలు, చీరల ఫెళఫెళ, కెరట్టాల్లా నవ్వులు, కింద మెత్తటి పచ్చగడ్డి, చల్లటి చిక్కటి ప్రేమకి చిహ్నంగా ఒత్తుగా పచ్చగడ్డి పక్కనే గుబురుచెట్లు. గుబురుచెట్ల వెనగ్గా జంటలు తలలువంచు కుని కబుర్లు, చాటుచేసికొని దగ్గరికి జరగటాలు......అమ్మో! నేను చూడలేను......భరించలేను......నా గుండెలు విచ్చి పోతున్నాయి. అక్కడనుంచి పరుగుతీశాను.

ఇంతకు మునుపు లోకంలోని ప్రతి చిన్న అందాన్ని పదే పదే చూసేవాణ్ణి, పొంగిపోయేవాణ్ణి. ఇప్పుడు తట్టుకోలేక పోతు న్నాను. అందం, సంతోషం, హాయి అంటే ద్వేషంకలిగిందో లేక అసూయవల్లనో నాగుండె బలహీనపడిపోయింది. నేనిక అందం అనుభవించటానికి పనికిరాను. ఇక ఈ లోకం నాకు కాదు. రూంవైపు పరుగెత్తుతున్నాను.

రోడ్డు మలుపులో అలవాటుగా ఎదురయ్యే బిచ్చగత్తె అడ్డుతగిలి సలాం చేసింది. ఆమె ముఖంలోకి చూశాను. ఆ

ముఖంలో ముసలితనం ముడతలు తెల్లటిజుట్టు, మినుకు మినుకు మంటూ వెలుగుతున్న కళ్ళు. ఆ కళ్ళలో వెలుగుతోంది ఆశ. అది బతకాలనే ఆశ......జేబులో చెయ్యిపెట్టే తగిలిన చిల్లరంతా ఇచ్చేశాను. వంగివంగి సలాం చేసింది.

ఒక్క పరుగున మేడమెట్లు దాటేస్తూ రూంలోకొచ్చి పడ్డాను. ఆఖరిమెట్టు తగిలి వేలు నొప్పెట్టింది. హోటల్ సర్వర్ ఎదురుపడి టీ పెట్టి వెళ్తున్నానని గాబోలు చెప్పాడు.

పక్కమీద పడుకున్నాను. గొల్లున ఏడుద్దామనిపించింది నేనింకా మనిషిగా ఈలోకంలో బతక లేనని నిర్ణయించుకున్నాను. ఇంతకుముందు చచ్చిపోదామని నిశ్చయించుకున్నాకదూ! ఆ నిశ్చయం చాలా సమంజసంగా కనిపించింది. తప్పకుండా అలాగే జరగాలనుకున్నాను. పక్కమీద అటూ ఇటూ పొర్లాను. ఈ పక్క ఈ పరుపు ఇన్నాళ్లూ మెత్తగా హాయిగా సుఖాన్నిచ్చాయి. ఈనాటితో ఋణం తీరిపోయింది.

గదినిండా చీకటి. లైట్ వెయ్య బుద్ధికావేదు. బయట వసారాలో చీకటి. కింద అంతస్తులో ఆడవాళ్ళ పిల్లల కేకలు. కింద అంతస్తులోని లైట్ల వెల్తురు లేచిన దుమ్ములా పైకి కన్పిస్తోంది.

నేనెట్లాగూ చచ్చిపోబోతున్నాకదా. ఇష్టమైంది ఏదన్నా తిందామని, అనిపించింది. నాకు స్వీట్స్ అంటే ఇష్టమని సీత

తెలుసుగా! ఒకసారి నా పుట్టినరోజున నీకు ఒంట్లో బాగులేక పోయినా చాలా చాలా స్వీట్స్ తయారుచేయించావే జ్ఞాపకం ఉందా! ఆఖరిసారిగా స్వీట్స్ తిందామనే కోరిక అంతలోనే చచ్చిపోయింది. ఏవీ తినదలచుకోలేదు. ఏదైనా ఇష్టమైంది తినటం అంటే బతకటం జ్ఞాపకం వస్తోంది......అంటే భయం...

ఆఖరిసారిగా నిన్నొకసారి చూద్దామనిపించింది. ఒక్కసారి నీలి కళ్ళల్లోకి, నీ కళ్ళలోని మెరుపులోకి చూడాలనిపించింది. నీ పూరేకుల పెదవులు విప్పి మళ్ళీ నా పేరెత్తి అమృతమయంగా పిలిస్తే వినాలనిపించింది. సాయం సంధ్యలాంటి నీ సాన్నిధ్యంలో ఒక్కక్షణం కూర్చుని వద్దామనిపించింది. నీకు చెప్తే కోపగించుకుంటావు. నిన్ను ఒక్కసారి, బలవంతాన ఐనాసరే కౌగిట్లో అదుముకుని వచ్చేద్దామనిపించింది. నా మెదడులో ఈ ఊహలు కదులుతున్నప్పుడు నాలో ఒక ఆవేశం పొంగింది. నెత్తురు వేడిగా పొంగింది.

కాని అంతలోనే నరాల్లో నిస్సత్తువ. ఆవేశం చల్లారిక ఆలోచిస్తే నా కోరికలకు అర్థంలేదనిపించింది. నిన్ను బలవంతాన ఐనాసరే కౌగిలించుకుందామనే కోరిక నాకు కలగటం వారీ బాధనిపించింది. చూశావా! నేను ఇంత క్రూరంగాకూడా ఆలోచించగలనని నాకు తెలియదు. అదొక తెగింపు...మొండితనం. ఎంత నొక్కిపట్టిఉంచినా ఒక్క ఆలోచనమాత్రం పదే పదే తలెత్తి చూస్తోంది. అది ఎవరికీ కన్పించకుండా పారిజాతం

కొమ్మల చాటునుంచి పెళ్ళి అలంకారాలతో నిన్ను ఒక్క రెప్ప పాటు చూద్దామని...ఆ దృశ్యాన్ని గుండెలో దాచుకుని కళ్ళు మూద్దామని...ఖర్మ...వద్దనుకున్నాను. తిరిగి అదే ఆలోచన. నే నెందుకు రావాలి మీ ఇంటికి? నేను వచ్చి నిన్ను చూడక పోతే పోయే దేముంది? నేను నీకేమవుతానని వచ్చి చూడను? హాయిగా సంతోషంగా పెళ్ళిచేసికొని సుఖంగా కాపురం చేయ బోతున్న నిన్ను కొద్దిసేపట్లో అన్నీ వొదులుకుని పోబోతున్న నే నెందుకు చూడాలి? ఈలోకం, ఈనవ్వులు, ఈఇంద్రధనుస్సు రంగులు, ఈ నిర్మలమైన నీళ్ళు, ఈ పగడాల్లాంటి పెదవులు, ఈ కేరింతలు, ఈ తృప్తి— అన్నీ మీవి. నాకేమున్నాయి?... నాకేమున్నాయి? నా చీకటి...చీకట్లో కేకలు...ఘోషలు... పగులుతున్న గుండెల్లో, కళ్ళు చిట్లిపోయేటట్లు ఏడుపులు...ఇదీ నాలోకం.మీలోకానికీ నాలోకానికీ పొత్తుకుదరదు. మీలోకపు తలుపులు నే నొస్తే మూసివేయబడ్డాయి. నాకందులో ప్రవే శార్హత లేదు.

ఏం నేనేం తప్పుచేశాను? నేనూ మనిషినేగా? మనిషిప్పు కోటం తప్పా? అందాన్ని మంచితనాన్ని...సౌకుమార్యాన్ని చూసి పొంగిపోవటం తప్పా? నేను మనసా కోరుకున్న మనిషి నాది. కావాలని గాఢంగా వాంఛించడం తప్పా? చెప్పు...సుశీ ...చెప్పు...నేనేం పాపం చేశాను?...నాకెందు కీఘోరమైన శిక్ష...ఎన్నెందుకిట్లా నాశనం చేశావ్...

క్షమించు సుశీ! ఏదో ఆవేశంలో అనవసరంగాఅన్నాను... క్షమించు...అట్లాంటి ప్రశ్నలకు ఇప్పుడుకాదు. ఎప్పుడూ సమాధానాలుండవు...పోనీ ఏదో మృత్యుముఖంలో ఉన్నవాడి ప్రేలాపన...నన్ను క్షమించవూ...ఇక ఆవిషయం వదిలేసాను. నామీద కోపం తెచ్చుకోవుగదూ!...నేనెన్ని తప్పులు చేసినా నన్ను క్షమిస్తావని నామీద కోపం తెచ్చుకోవని ఆశ... నాఆశ నిజం చేస్తావుకదూ! ఆ తృప్తి చాలు. హాయిగా వెళ్ళిపోతాను.

మరో పది నిముషాలు నా జీవన సహచరులు, దిండ్లు పరుపుల్ని కావలించుకుని గడిపాను. కళ్ళు మూసుకుంటే చీకటి. కళ్లు తెరిచినా గదిలో చీకటే. ఏదీ కన్పించటంలేదు. అంచేత కళ్ళు మూసుకోవటమే మంచిదనుకున్నాను. కాని కళ్ళు మూసుకుంటే ఎందుచేతనో కళ్లలో సూదులు గుచ్చుకుంటున్నాయి. మెదడు తీవ్రంగా ఆలోచిస్తోంది. మనసు భారంగా కుంగిపోతోంది. బాధ మరీ ఎక్కువవుతోందని కళ్లు తెరిచాను... ఛత్ ! కొంచెంసేపట్లో వెళ్లిపోబోతున్నవాణ్ణి బాధపడటమేమిటనిపించింది. బాధ పడకూడదనుకున్నాను. నాకు నవ్వొచ్చింది. నవ్వుకున్నాను. చాలదనిపించింది. పెద్దగా నవ్వాను... మరీ పెద్దగా నవ్వాను...పగలబడి నవ్వాను... ఇంకా నయం కింద వాళ్ళెవరూ పరుగెత్తుకు రాలేదు. చెంగున వెళ్లి లైట్ వేశాను. భళ్లున గదిలోకి వెలుగు దూకింది. గదినిండా వెలుగు. ప్రతీ వస్తువూ కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. మంచం, కుర్చీలు,

టేబుల్, అద్దం, ఫ్లాస్కు— అన్నీ కాంతిలో మెరిసిపోతున్నాయి. ఫ్లాస్కు— విప్పి గట గట కప్పు టీ తాగాను.

ఆ రోజు నిన్ను ఆఖరిసారి చూసినరోజు జ్ఞాపకంవచ్చింది. అప్పట్లో మీరంతా కలసి హైదరాబాద్ వెళదామని మాట్లాడుకుంటున్నారు. వెళ్తే ఒక నెలదాకా తిరిగి రామని చెప్పావు నువ్వు. నాకప్పుడే ఎందుచేతో అనిపించింది! నువ్వు నాకిక అందకపోవచ్చునని. నేను ఆ సాయంత్రం మీ ఇంటి కొచ్చేసరికి, ఆ మర్నాడు తెల్లవారుజామున ప్రయాణానికి అంతా సర్దుకుంటున్నారు. నువ్వు అదే తొందర్లో ఉన్నావు. హాల్లో కొచ్చి చూశాను. ఎవరూ కన్పించలేదు. అవతల గదిలో ఏదో బట్టలచప్పుడు మధ్యగదిలోంచి నీ కేక. బహుశా చీర గురించనుకుంటాను. నేనెవర్నీ పిలవలేకపోయాను. అలాగే నుంచున్నాను. నువ్వు నాలుగు చీరలు చేతితో పట్టుకుని మధ్య గదిలోంచి అవతల గదిలోకి వెళ్లడానికొచ్చి హాల్లో నన్ను చూశావు.

'అయ్యో! ఎంతసేపయింది వచ్చి' అన్నావు.

నేను తలూపాను. తర్వాత 'ఇప్పుడే' అన్నాను సన్నగా.

'కూర్చో, ఇప్పుడే వస్తా' అని అవతలి గదిలోకి వెళ్ళావు నువ్వు.

అవతల గదిలో నువ్వు మీ అమ్మా, చెల్లెళ్ళూ పెట్టెలు సర్దుకుంటూన్న చప్పుడు. నువ్వేదో చెప్తున్నావు. వాళ్ళు గబ గబ మాట్లాడుతున్నారు. పకపక నవ్వులు, సన్నగా విసుక్కోటాలు, నువ్వు గబగబా గదిలోంచి వచ్చి నాముందు కూర్చున్నావు.

'ఏవిటో అంతా హడావుడిగా ఉంది' అన్నావు మొహంమీద పడ్తున్న జుట్టు పైకి తోసుకుంటూ.

నేనేమీ మాట్లాడలేక పోతున్నాను. నా గుండె బాధగా కొట్టుకుంటోంది. నువ్వు అన్నీ సర్దుకు వెళ్ళిపోతున్నావు. నాకు చాలా దూరంగా వెళ్తున్నావు...శాశ్వతంగా నాకు దూరమై పోతావేమోనన్న అనుమానం లోపల తిరుగుతోంది. నెలరోజుల దాకా మళ్ళీ కన్పించవు పైగా వెళ్తున్నది హైదరాబాద్... హైదరాబాద్...శేఖరం వున్నవూరు...

నీ కళ్ళలోని తొందర, నీ చెరిగిపోయిన జుట్టు నలిగి పోతున్న చీర, నీ హడావుడి, ప్రయాణపు సంబరం చూస్తుంటే నాకు బాధగాఉంది. అదిపైకి చెప్పకూడని వ్యథ. లోలోపలే దిగ మింగు కుంటున్నాను. నా ముఖంలో దైన్యం బాగా కన్పించింది కాబోలు నువ్వడిగావు. 'ఏం ఒంట్లో బాగ లేదా?'

నేను సమాధానంగా నవ్వాను. తలతిప్పాను.





'ఊఁ' అన్నావు నువ్వు. నానుంచి మాటల్లో జవాబు కావాలన్నట్లు.

'బాగానే ఉంది. రేపేనా ప్రయాణం?' అన్నాను.

'ఆ! ఆ! రేపొద్దుటే..... ఆ ఏం ప్రయాణం బాబూ తలనొప్పి అన్నావు ఏదో ఇష్టంలేనట్లు ఇష్టంగా ఉన్నట్లు నాకు కనిపించకూడదని అట్లా అన్నావుకదూ! ఎందుకంత కుత్సితం! నేను వదలకుండా అదే గుచ్చిగుచ్చి అడిగాను.'

'ఏం! తలనొప్పేం? హాయిగానే ఉంటుందీ' అన్నాను.

'ఆ! పోనిద్దూ' అని మాట తప్పించబోయావు.

కాని నేను వదల్లేదు. 'హైదరాబాద్ చాలా అందమైన ఊరు. హాయిగా కాలం వెళ్ళిపోతుంది...సుఖంగా అన్నీ...'

'ఉండు టీ తీసికొస్తాను' అని ఉన్నట్టుంటి లోపలి కెళ్ళావు.

నువ్వు గజగజలాడి పోయావు. ఎందుకింత దాపరికం! నా నుంచి దాస్తున్నావని తోచగానే నీ మీద చెడ్డకోపం వచ్చింది. మాటలతో సూదిపోట్లు పొడవాలనిపించింది. నువ్వు టీ తీసికొచ్చి ఇచ్చావు. నేను టీ తాగుతూ నీవైపే చూస్తున్నాను. ఇదివరకు ఆ కళ్ళవైపు ఆ చెక్కిళ్ళవైపు సంతోషంగా ఆశగా చూసేవాణ్ణి. ఇప్పుడు కోపంగా పొడిచేద్దామన్నట్లు చూస్తున్నాను.

'నువ్విచ్చిన పుస్తకం చదివేశాను. ఇంకోటిస్తావా?' అన డిగావు.

నాకు 'కోపం మండిపోయింది. ఇంకా నీకు నా పుస్తకా లెందుకు? ఆమాటే బయటికనేశాను.' హైదరాబాద్ వెళ్తున్నా వుగా ఇంక నాతోటి నా పుస్తకాలతోటి ఏంపని?

నువ్వు నావైపు ఆశ్చర్యంగా చూశావు. నేనట్లా మాట్లా డతానని అనుకోని వుండవు. నీ ముఖం ముడుచుకు పోయింది.

'నా మీద కోపంవస్తే నన్ను వేధించేపద్ధతి కాబోలుఇది' అన్నావు తలొంచుకుని.

'కోపమెందుకు? ఉన్నమాటేగా?' అన్నాను నేను.

'ఏమిటి రామం నువ్వనేది నన్ను హైదరాబాద్ వెళ్లొ ద్దంటావా? చెప్పు మానేస్తాను' అన్నావు ఒక్కఉదుటున. నీ కనుకొలకుల్లో ఓ కన్నీటిచుక్క.

నేను తల్లడిల్లిపోయాను. చప్పగా చల్లారిపోయాను. నే నొద్దంటే ఆగిపోతావా? నామాటకి ఇంకా ఎంతవిలువ!

'మరేం లేదు సుశీ, మళ్ళీ తిరిగి ఎప్పుడొస్తావోనని అన్నాను తలొంచుకుంటు.

'మరీ చిన్న పిల్లాడివై పోతున్నావు' అని సన్నగా నవ్వావు.

నాకు ప్రాణం పోయనిపించింది. ఆ నవ్వుతున్న పెదవుల వైపు చూశాను. ఉదయ సూర్య కిరణంలా ఆ పెదవుల చివర దాకా పాకి ముఖంనిండా కమ్ముకున్న ఆ నవ్వు...అది నాదే అన్న ఆశ ఇంకా నాకుంది. కాసేపు ఇద్దరం మాట్లాడలేదు. నేను గబగబా మాట్లాడేద్దా మనుకున్నాను. మనం వెనక చూచాయిగా ఇద్దరం కలసి జీవిద్దామని ప్రస్తావించుకున్న సంగతి తిరిగి కదలిద్దామనిపించింది. నిక్కచ్చిగా నన్ను పెళ్ళాడబో తున్నావో లేదో తేల్చేసుకుందామనుకున్నాను. కాని మాటలు ఎంచేతో ధారాళంగా రాలేదు.

'మళ్ళీ ఎప్పుడొస్తావ్?' అన్నాను.

'బహుశా తొందరగానే అన్నావు నువ్వు. నువ్వు తూచి తూచి మాట్లాడు తున్నట్లనిపించింది.'

'అంటే ఓ నెలా?' అన్నాను.

'అబ్బే! అంతదాకా ఉండను. మహాఉంటే పది పదిహేను రోజులు' అన్నావు.

'మీ నాన్న నెలదాకా తిరిగి రామన్నారు?'

'అట్లా అన్నారా? ఏమోనబ్బా నేనుమాత్రం పది పది హేను రోజులకు పైగా ఉండలేను. నాకు విసుగు' అన్నావు.

నువ్వేదో దాస్తున్నట్లనిపించింది. నా కాసమాధానాల మీద అన్నీ అనుమానాలు. నాకు నిజంచెప్తే నేను బాధపడతా

ననో లేక నాకు అన్ని సంగతులూ చెప్పాల్సిన అవసరం ఏముం దనో?...నేనంత పరాయివాణ్ణి అయిపోయానా?

'మళ్ళీ నన్ను ఓదార్చటానికి కాబోలు నీవు గొంతు సవరించుకొని అన్నావు' నువ్వు పరీక్షలకి బాగా చదువు. నీపరీక్షలయిపోయి శలవు లిచ్చేటప్పటికి నేను వచ్చేస్తాను నీకు క్లాస్ రావాలి. లేకపోతే వూరుకోను.' అన్నావు.

ఏవిటో నా పరీక్షల గురించి, క్లాస్ గురించి అంత శ్రద్ధ! నా కిదంతా అసందర్భ ప్రసంగంగాను, నన్ను మభ్యపెట్టడానికి మాట్లాడు తున్నట్లు అనిపిస్తోంది. నేను కొద్దిగా నవ్వాను. ఆ నవ్వులో వ్యంగ్యం తోచిందేమో నీముఖం ముడుచుకుపోయింది. నా మనసు చివుక్కుమంది. ఎందుకనో నీవు నొచ్చుకున్నట్లు కన్పిస్తే చాలు నేను తట్టుకోలేను. మనం మాట్లాడుకున్న ఈ మాటలవల్ల ఒకళ్ళకొకళ్ళం మరీ దూరంగా జరుగుతున్నా మేమో అనిపించింది. ఆ వ్యవహారంగానే నాకు దుఃఖంవచ్చింది. నేను నిన్ను వొదులుకోలేను సుశీ! నేనా ఆలోచనే భరించలేను.

'నన్ను మర్చిపోతావా?' అన్నాను దిగులుగా.

నీవు దెబ్బతిన్నట్లు కన్పించావు. నానుంచి అంత బరువైన మాట వస్తుందనుకోలేదు.

'అవేం మాటలు రామం!' అన్నావు.

నేను తమాయించుకొన్నాను. 'మరేంలేదు ఉత్తరాలు రాస్తావా?' అనడిగాను.

నువ్వు ఒక్క-క్షణం మాట్లాడలేదు. 'అలాగే' అన్నావు గంభీరంగా.

నాకు ఆ క్షణకాల మౌనం ఆ గంభీరమైన సమాధానం పిడుగుపాటులా తోచింది. ముగించబోతున్న ప్రకరణాన్ని అనవసరంగా సాగిస్తున్న రచయితముఖంలా ఉంది నీ సమాధానం. మళ్ళీ మనిద్దరిమధ్యా కొంతసేపు మాటలు లేవు. ఈ నిశ్శబ్దం నీకూ నాకూ దుస్సహంగానే ఉంది. నేనెప్పుడు లేచి వెళ్ళిపోతానా అని చూస్తున్నావనిపించింది. నేనిక కూర్చోలేకపోయాను. నేను కట్టుకున్న ఆశలమేడలు ఒకటొకటిగా కూలిపోతున్నాయి. కాని ఇంకా ఆశ...నా సుశీ నాకు అన్యాయం చెయ్యదని ఆశ...అదే నన్ను మాట్లాడనిచ్చింది. ఊపిరి పీల్చుకోనిస్తోంది...

గుండె బరువుగా ఉంది. మళ్ళీ నువ్వొకసారి నవ్వుతూ మాట్లాడితే నా బాధంతా పోతుందనిపించింది. కాని నిన్నెట్లా నవ్వుతూ మాట్లాడించటం?

'నే వెళ్తాను' అని లేచాను.

'సరే' అని నువ్వు లేచావు.

నా తలమీద కొట్టినట్టయింది. 'అప్పుడే ఏం తొందరని కాస్సేపు కూర్చో. వెళ్ళొచ్చులే, మళ్ళీ నేను నెలదాకా రాను'

అంటావేమో అనుకున్నాను. నేనిక నిల్చోలేకపోయాను. నా నా కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. నువ్వు నన్నంత నిర్దాక్షిణ్యంగా నిరాదరిస్తావనుకోలేదు. తల పక్కకి తిప్పుకుని ముందుకు నడిచాను. ద్వారం దగ్గర కొచ్చాను.

'రా...రా...మం...బిందువుల మాలలా నీ పిలుపు.

నేను వెనక్కు తిరగలేదు. తిరిగితే నా కన్నీళ్ళు చెప్పేస్తాయి. అలాగే నిల్చున్నాను. నువ్వే నా దగ్గరికి నడిచి వచ్చావు. నా వెనకగా, నాకు దగ్గరగా నీ నిశ్వాస: నా బుజాలికి తగిలేంత దగ్గరగా నుంచున్నావు.

'రామం...నా మనసు బాగాలేదు. నేను ఊరెళ్ళాక అంతా నీకు ఉత్తరం రాస్తాను. నువ్వు బాధపడకు అన్నావు.

నా గుండె సంతోషంగా కొట్టుకుంది. 'నాసుశికి నా మీద ఆమాత్రం దయఉంది. అదేచాలని' అన్నాను.

'అదుగో అట్లాంటి మాటలనకు రామం... నీకంతా రాస్తానుగా...' అన్నావు. నీ గొంతులో వెక్కిళ్లు.

'సరే...సుశీ...' అని నడిచొచ్చేశాను.

నేను గబగబా పెద్ద పెద్ద అంగలేసుకుంటూ నడుస్తున్నాను. నా గుండెలో సంతోషపు టలలు ఉవ్వెత్తుగా పొంగుతున్నాయి. లోకాన్ని జయించినవాడిలా హుషారుగా నడుస్తు

న్నాను. కాని మధ్య మధ్య చాలా విలువైంది పోగొట్టుకుంటు న్నానేమోనని భయం. ఆ అనుమానాల్ని భయాన్ని నొక్కి పెట్టి ఆ రాత్రి రెండింటిదాకా వీధులన్నీ ఒక ఉన్మాదావస్థలో తిరిగాను. ఆ తర్వాత అలసిపోయి గూంకొచ్చి పడుకున్నాను.

మనిద్దరం మొదట ఎట్లా కలుసుకున్నామో జ్ఞాపకం ఉందా! నీకు సరిగ్గా జ్ఞాపకం ఉందో లేదో తెలియదుకాని నాకు బాగా గుర్తుంది. ఎన్నిసార్లు గుర్తుకు తెచ్చుకున్నానో ఆ సాయంత్రాన్ని ఆ సంఘటల్ని. ఆరోజు నాకు చాలా ఇష్ట మైన రోజు. నా పుట్టినరోజులాంటిది. మళ్ళీ ఆ ఖుశియల్ని మనసు ముందుకు తెచ్చుకుంటాను.

సాయం సంధ్యలో ఎగుడు దిగుడుగా మట్టిదిబ్బలు పరుచు కుని అక్కడో ఇల్లు ఇక్కడోయిల్లు నిలబెట్టుకున్న ఆ వూరే మా వూరు. ఆ ప్రదేశం గతంలో మహావైభవం అనుభవించిం దనీ, ఈనాడు శిథిలావృతంగా ఉన్నా చరిత్రలో మహత్తరంగా దర్శనమిస్తుందని అనుకున్నపుడు నాకెంత పులకరిస్తుందని! ఆ వూళ్ళో ఇళ్ళకంటే పడిన గోడలే ఎక్కువ. జనమంటూ వుంటే ఆ ఎత్తుపల్లాల మట్టిదిబ్బలమధ్య పచ్చగా అక్కడొకడు ఇక్కడొకడు సున్నపురాయి తవ్వుకుంటూనో, చేపలవల అల్లు కుంటూనో కన్పిస్తారు.

నాకు మా వూరంటే ఎంత ఇష్టమో నీకు తెలు సుగా. చిన్నప్పట్నించి చూస్తున్నవైనా, ప్రతి వస్తువూ ప్రతి

దృశ్యమూ నాకు నిత్యనూతనంగా ఉంటాయి. ఎన్ని శతాబ్దాల కాలాన్ని చూసిందో ఆ నేల! చిరయౌవనవతిలా అనిపిస్తుంది ఆ ప్రదేశం.

ఆ విరిగి పడిన గోడలు, పెరిగి విచ్చిన చెట్ల దుబ్బులు నేల గుండెలోకి చొచ్చుకున్న గోతులు, మోరవేసిన దిబ్బలు చూస్తుంటే నాకు వాటి పురావైభవం కళ్ళలో కదుల్తుంది. ఆ దోవకడ్డంగా పడివున్న శిలా స్తంభం శాతవాహనులనాటి విజయకేతనాల రెపరెపలు చూపిస్తుంది. విశాలంగా గాలిలో విచ్చుకున్న మహావటవృక్షం ఆనాటి వీరగాథలు చెప్తుంది. ఆ పల్లె నానుకుని రాళ్ళమధ్యగా గలగల రొదచేస్తూ ప్రవహించే కృష్ణానది ఆనాటి వైభవోజ్వల గీతుల్ని పాడి విన్పిస్తుంది. అదేమిటి! ఇదేమిటి! ప్రతి చిన్న వస్తువూ మహర్దశ అనుభవించింది. ఆ నేల పవిత్రమైంది. అక్కడ పడివున్న దుమ్ము రేణువు పెట్టిపుట్టింది. ఇంతటి మహానుభావుకతముందు నేనెంత! నా అస్తిత్వమెంత?– ఏవిటో మామూలని తెలుసుకుంటే చాలు ఇట్లా అయిపోతాను.

చిన్నప్పుడు నాకు తీరిక చిక్కినప్పుడల్లా వెళ్ళి, తిరిగి నేల మీద పడివున్న ఆ శిల్పాలమధ్య కూర్చోవటమో, ఆ ఎత్తయిన మట్టిదిబ్బలమీద తిరగటమో, ఆ గోతులు చెట్లదుబ్బులు వున్న చోట వెళ్ళి పడుకోటమో, లేకపోతే కృష్ణ ఒడ్డున నుంచుని అంచులో తెగచాప లెత్తుకునిపోతున్న పడవల్ని చూస్తూ ఉండ

టమో చేసేవాణ్ణి. నేను వేళకు ఇంటికి అన్నానికి రాకపోతే మా అమ్మ మట్టిదిబ్బలమీద కృష్ణ ఒడ్డున వెతుక్కుంటూ వచ్చేది. నా కాలమంతా అట్లాగే గడిచింది. నేనట్లాగే పెద్ద వాణ్ణయ్యాను. పెద్దవాణ్ణయి బి. ఏ. పూర్తిచేసినా శలవులకు ఇంటికి వెళ్ళేవాలు. ఇంట్లో భోజనం వేళకి మాత్రం ఉండే వాణ్ణి.

అప్పుడు మాకు శలవులు. సంధ్యాదేవి ఎర్రచీర కట్టుకున్నట్లు పడమట అరుణిమ. పట్నంనుంచి దోవచేసికొచ్చిన మీ కారు గాలిగోపురం దగ్గర ఆగిపోయింది. ఆ కారులోంచి మీ అమ్మ నువ్వూ దిగారు, దిగీదిగంగానే మీకు కన్పించిన ఏడంతస్థుల గాలిగోపురం, ఆ వెనక బ్రహ్మాండమైన దేవాలయం, అందులో అనేక చిన్న దేవాలయ శిఖరాలు, ఆ పక్కగా రొద చేస్తూ పారుతున్న కృష్ణానది మీకు దిగ్భ్రమ కలిగించి ఉండాలి. అట్లాగే ఆ గోపురాలవంక చూస్తూ ఆ కృష్ణ రొద వింటూ కాస్సేపు నుంచున్నారు. ఆ వాతావరణంలో గాంభీర్యానికి గొప్ప కారణం అక్కడి నిశ్శబ్దం. అది ప్రశాంత వాతావరణంలో గొప్ప తైలవర్ణ చిత్రాన్ని చూస్తున్నట్లుంటుంది. పైగా పలకరిద్దామన్నా ఎక్కడా మనిషి జాడలేదు.

నేను రెండో అంతస్తులో విరిగి పడిన శాసనం పక్కన ఓ చిన్న బండ ఉంటే దానిమీద కూర్చుని పుస్తకం చదువుకుంటున్నాను. మీరంతా ముక్కలు చెవులూ చేతులూ విరిగి

పోయిన శిల్పాల్ని చూస్తూ అవి ఏవయిఉంటాయో ఊహించుకుంటూ నేను కూర్చున్నవైపు కొచ్చారు. మనిషన్నవాడు ఆ రాళ్ళమధ్య కన్పించేప్పటికి సంతోషమైందేమో, మీ నాన్న నన్నుచూసీచూడగానే 'బాబూ' అన్నాడు.

నాకూ ఆ పిలుపు కొత్తగా తోచింది 'చెప్పండి' అని లేచొచ్చాను.

'మీది...మీది ఈ వూరేనా నాయనా' అన్నాడు మీ నాన్న. అవునన్నాను.

'మేం పట్నంనుంచి వచ్చాం మాకు ఇక్కడి వివరాలు తెలియవు కొంచెం చెప్తారా!' అన్నారు.

అప్పుడప్పుడు యాత్రికులు కొందరు నన్నిట్లా అడగడం అలవాటే. సరే పదమన్నాను. ముందుకు నడుస్తు ఆ బౌద్ధ శిల్పాన్నిగురించి రెండువేల ఏళ్ళనాటి ఆ బౌద్ధారామాన్నిగురించి ఉత్సాహంగా చెప్తున్నాను. పక్కగా ఓ పాలరాతి బుద్ధవిగ్రహం కాళ్లు తెగి పడిఉంది. నాకా విగ్రహాన్ని ఎప్పుడుచూసినా ఎడతెగని విచారం వేస్తుంది. ఆ విగ్రహంగురించి చెప్తూ సగంలో ఆపేశాను. నాగొంతు బొంగురుపోయింది. అప్పుడే ఒకసారి తలెత్తి చూశాను. నిన్నప్పుడే నాలుగైదు సెకన్లపాటు పరిశీలించాను. నువ్వు నావైపుఆశ్చర్యంగా చూస్తున్నావు. నీకళ్లల్లో కాంతి. నా మనసులో మూగబాధ. నీచూపులోని కాంతిలో సుఖం, ఊరడింపు. నా మనసులోని మూగబాధలో సంగీతం.

ఆ తర్వాత నే నింకేమీ చెప్పలేదు. నీవు అక్కడవున్నా వన్నవిషయం నన్ను స్ఫుటంగా కదిలించేస్తోంది. నేను ధారాళంగా మాట్లాడలేకపోయాను. నడుస్తూ మధ్యమధ్య నీవైపే చూసేవాణ్ణి. నువ్వుకూడా నన్ను చూస్తున్నట్టుండేది. నేను చూడగానే తల తిప్పేసుకునే దానివి. దేవాలయానికి వెళ్ళేదోవలో ఒక కాలిబాట ఉంది. ఆ బాటలో ఒకళ్ళు మాత్రమే నడిచివెళ్ళగలరు. ఒకళ్ళ వెనకాల ఒకళ్ళం నడుస్తున్నాం. నేను కావాలని నీ వెనకాల నడుస్తున్నాను. అప్పుడు నువ్వు చూడకుండా నేను నిన్ను చూడొచ్చు. నీ జరీపోగుల మబ్బురంగు వోణీ అలలు అలలుగా కదుల్తోంది. నీ వొంకు లొంకుల జడ, నీ వెనకనుంచి నిన్ను పరిశీలిస్తున్నట్లు తెలిసిన నీ మనసులా అటూ ఇటూ గిజగిజ లాడుతోంది. నడుస్తున్నప్పుడు నీ నడుం వొంపులు నీ పాదాల కదలికలు నాకు గిలిగింతలు పెట్టాయి. బాట దాటంగానే నువ్వు ఆగిపోయి నన్ను ముందుకు పోనిచ్చావు. నీముఖంలో సిగ్గుఎరుపు నీ కన్నుల్లో కాటుకనలుపు 'ఊ గొప్పతనమే' అన్నట్లు పెదవి నొక్కి చూసినచూపు. నాకు ముందు నడవక తప్పలేదు.

చిన్న గుళ్ళదగ్గిరికొచ్చాం. ఒక్కొక్క గుళ్ళో ఒక్కొక్క శివలింగం ఉంది. మీ నాన్న ఆపేర్లు చదువుతూ చెప్తున్నాడు. ఈ లింగం విశ్వేశ్వరుడు, ఇక్కడ సోమేశ్వరుడు, అక్కడ ప్రణ వేశ్వరుడు అని చెప్పుకుపోతున్నాడు. నీకు విసుగొస్తున్నట్లుంది. మధ్య మధ్య నావైపు చూసేదానివి. నేను నీవైపు చూస్తూ

కన్పించేవాణ్ణి. మళ్ళీ తలంచుకునే దాఁవి. మీనాన్న ఇంకా చెప్పకుపోతోంటే నువ్వన్నావు 'ఉన్న దేవుడొకడేకదా, ఆమహా దేవుణ్ణి ఎలాగూ పైన చూడబోతున్నాం. ఏవిటీ కాలయాపన' అని.

మొదటిసారి నీగొంతు విన్నానుగదూ నేను లోపల ఉలిక్కిపడ్డాను. కాని నువ్వు అన్నది నాకు నచ్చలేదు. నే నందు కుని సమాధానం చెప్పాను.

'అట్లాకాదేమో! గొప్పతనం సౌందర్యం వున్నవి ఒక్క-చోటే రాసి పోసి ఉండవుగా. ఇవి ఎంత చిన్న దేవాలయాలైనా వీటి అందం వీటిది.'

మీ అమ్మా నాన్న ఏవీ మాట్లాడలేదు.. మనిద్దర్నీ ఒకసారి చూశారు. మళ్ళీ ముందుకు నడిచాం అంతా.

మళ్ళీ మీనాన్న 'ఈ దేవాలయం మహిషాసుర మర్దని దేవి విగ్రహం ఎంత భీకరంగా ఉందో చూశావా?' అని మొద లెట్టారు.

'నాన్నా! మనం త్వరగా నడవాలి. గంటలు మోగు తున్నాయి. పూజారి విచ్చేసినట్టున్నాడు' అన్నావు నువ్వు.

అంతా పెద్దగుడివైపు నడిచాం. రెండో ప్రాకారంలోంచి మూడో ప్రాకారంలోకి రావటానికి సల్లభై మెట్లెక్కాలి. నేను

గబగబా ముందు మెట్లెక్కుతున్నాను. చిన్నపిల్లల్లా పంతంకొద్దీ నువ్వుకూడా నాతో గబగబా ఎక్కావు. నేను మరీ వేగంగా ఎక్కాను. నువ్వూ పరుగెత్తావు. ఇద్దరం మెట్లన్నీ ఎక్కేసి అక్కడ అరుగుమీద కూర్చున్నాం రొప్పుతూ. ఆయాసపడుతూ ఇద్దరం ఒకళ్ళ నొకళ్ళం చూసి నవ్వుకున్నాం. బహుశా అదే మొదటనుకుంటా ఇద్దరమూ సూటిగా చూసుకుని నవ్వుకోటం. హాయిగా నవ్వుకున్నాం. నిండుగా నవ్వుకున్నాం. కారణం లేకుండా ఆపుకుని ఆపుకుని తెరలు తెరలుగా నవ్వుకున్నాం. గుచ్చిగుచ్చి చూసుకున్నాం అంతలో మీ అమ్మా నాన్న వచ్చారు. మళ్ళీ మామూలు అయిపోయినాం ఇద్దరం.

అంతా దేవాలయంలోనికి అడుగుపెట్టాం. గంగడోలు పైన గంటలు కట్టుకుని నిల్చున్న బ్రహ్మాండమైన నందినిచూసి మేమంతా ఆశ్చర్యపోయాము. ఆ నందిచుట్టూ రాగి రేకు తొడిగారు. దానిమీద బంగారునీరు ఊదారు. గంభీరంగా తనస్వామి వైపు మోరపైకెత్తి చూసే నందీశ్వరుణ్ణి తాకి తన్మయులయారు మీ అమ్మ నాన్న. నీ ముఖం గంభీరంగా ఉంది. కళ్ళలో ఆశ్చర్యంవల్ల కల్గిన తృప్తి. నేను నిన్ను పరిశీలించకుండా ఉండలేక పోతున్నాను.

పూజారి అర్చన చేస్తున్నారు. ఎదురుగా ఈశ్వరుడు పదహేను అడుగుల ఎత్తుగల పాలరాతి లింగాకారం. ఆ విగ్రహంలో భక్తులకు చేష్టలుడక్కి అచేతనులను చేయగల సౌమ్యత ప్రశాం

తత ఉన్నాయి. నిరలంకృతుడుగా కేవలం విభూతి రేఖలతో విరాజిల్లుతున్న మహాదేవునికి పూజారి కర్పూర నీరాజన మెత్తాడు. ఆ హారతి ప్రభలలో తెల్లటి పాలరాతి లింగాకారం ఎర్రటి కాంతులు పులుముకుంది. గంటలు గణగణ మోగాయి. మీ అమ్మ నాన్న తన్మయులై పోయారు. నీవు నిశ్చలంగా నిల్చున్నావు. ఇంకా గంటలు మోగుతున్నాయి. ఉన్నట్టుండి నీవు నావైపు చూశావు. నీకళ్ళు వెలుగుతున్నాయి. నీ నుదుటి మీది గుండ్రని కుంకుమ వెలుగుతోంది. నావైపు నిర్భయంగా, నావైపు ఆశగా, నా గుండెలోకి తీక్షణంగా చూశావు. అట్లా ఎందుకు చూశావు? ఎందుకు చూశావు సుశీ? నేను తట్టుకోలేక పోయాను. నేను తల్లడిల్లి పోయాను. ఆ మంగళ వాద్య నినాదాలలో. ఆ వేద మంత్రోచ్చారణలో నీ చూపుల వరప్రసాదంలో నేను ఉన్మత్తుణ్ణై పోయాను. నేను నీవైపు చూశాను. హాయిగా నవ్వాను. నా ప్రాణం తీసేసుకో అన్నట్లు చూశాను. కర్పూర నీరాజనారుణిమలో మునిగిపోయిన మహాదేవుణ్ణి చూసి 'నన్ను. నీదగ్గిరికి చేర్చుమని' కోరుకున్నాను. అదే మొదలు...అదే నాంది.

స్వామి గుళ్లో అర్చనాదులు ఐన తర్వాత పరమేశ్వరి బాల చాముండేశ్వరికి ప్రార్థనలుచేసి ఉత్తర ద్వారంగుండా వెలుపలికి వచ్చాం. అక్కడినుంచి రాళ్ళమధ్య దోవచేసికొంటూ మెలికలు తిరిగి ప్రవహించే కృష్ణానది కన్పిస్తోంది. కొసరు మిగిల్చిన సూర్యకిరణాల నీడలు నీళ్ళమీద తళతళ లాడుతున్నాయి. పరిమళించి పచ్చిగాలి నూతనోత్తేజం కలిగిస్తోంది. చిన్న చిన్న

బండరాళ్ళమీద కూర్చొని స్వామి ప్రసాదం కొబ్బరి తింటూ నదివైపు చూస్తున్నాం. కృష్ణగాలి విసురుకి నీపైట తీవలాంటి ఒంటికి చుట్టుకుని ఉండటం నచ్చక కాబోలు ఎక్కడికో ఎగిరి పోతానంటోంది.

'నీ పేరేమిటి నాయనా! నువ్వేంచేస్తున్నావ్?' అనడిగారు మీనాన్న.

నేను చెప్పాను. నేను బి. ఏ. పూర్తిచేసి నందుకు కొంత ఆశ్చర్యంకూడా కన్పించింది.

మరి తర్వాతేం చేస్తావన్నారు. ఇంకా నిర్ణయించుకోలేదన్నాను. మీ నాన్నగారి పలకరింపులోని ఆప్యాయత నాకు హాయిగా ఉంది. నువ్వు లేచి అటూ ఇటూ తిరుగుతున్నావు.

మీ నాన్నగారు ఇంకా మా ఇంటివిషయాలేవో అడుగుతున్నారు. అంతలో దూరాన్నుంచి 'ఇదేవిటండీ' అన్న నీగొంతు విన్పించింది. నువ్వు ఓ శిలాశాసనం చూస్తున్నావు. నేను నీదగ్గర కొచ్చాను. నువ్వా శాసనంవైపే చూస్తున్నావు. నేను రాంగానే కొంచెం తబ్బిబైనావు. అది ఆ మాటల్లోనే తెలిసింది. ఇం... ఇం...ఇదేమటండీ? అన్నాను.

'అది కోటకేతరాజుల నాటి శాసనం తెలుగే' అన్నాను.

'మరి అర్థంకాదే' అన్నావు.

'అది ఆనాటి తెలుగు...వెల్తురుంటే చదువుతాను,

అయినా చదువుతాను అని కొంత కొంత చదివి వివరించాను!

'మీది ఈ వూరేనన్న మాట'

'అవు'నన్నాను.

'అదృష్టవంతులు'

'పుట్టిన మాత్రాన అదృష్టవంతులవుతారా?'

'మాది పట్నం'

'నేనడగలేదు'

'అడగంది చెప్తే అది మాటకాదా?'

'మాటేకాని అప్రస్తుతం అవుతుంది'

'అయితే మాటాడనులెండి'

'కోపం తెచ్చుకోకండి. నవ్వుతూ అన్నాను'

'అదేం లేదు. కనీసం కోపమైనా ప్రస్తుతం అని గుర్తించాను' అని నవ్వావు నువ్వు. ఆ నవ్వు గుడిగోపురంమీది రామచిలక నవ్వులా అనిపించింది నాకు.

'నాకు ఈ వూరు ఇక్కడంతా చాలా బావుంది... ఎంత బావుందో...' అని పొంగిపోయావు.

నిన్నట్లా చూస్తుంటే నాకు ఎంత తృప్తిగా ఉందని!

'రండి! మీ కింకో మంచి సీన్ చూపిస్తా' అన్నాను.

ప్రహారీ చివరికి వెళ్ళి 'అదిగో ఆగాలిగోపురం చూడండి' అన్నాను.

అక్కడ ఏడంతస్తుల గాలిగోపురం ఎరఎర్రగా మెరుస్తున్న శిఖరాలు మసగ వెలుతురులో ఆ గొప్ప కట్టడం ఆకాశంలోకి చొచ్చుకుపోయినట్టుంది. ఆ సంధ్యలో కొన్ని వేల పావురాలు ఆ గాలిగోపురంలోని గూళ్ళకి చేరుకోవటం అక్కడి దృశ్యం. ఆ గోపుర శిఖరాలచుట్టూ పావురాలు, తెల్లవి, మచ్చలవి, మబ్బురంగువి ఆ శిఖరాలచుట్టూ ఎగరటం, గూళ్ళలోకి దూరటం మళ్ళీ పైకెగరటం, రెక్కల తపతపలు, కువకువలు పైన నీలిఆకాశం, కింద ఆ గోపుర శిఖరాల్ని చుట్టుకొని వేలకొలది పక్షులు! అబ్బ! ఎంత బావుంది.

ఆ దృశ్యం చూసి నీ కళ్ళు మెరిసిపోయినై. నీ కనురెప్పలు అల్లల్లాడినవి. నీ ముఖం వెలిగిపోయింది. నువ్వు దాదాపు చిన్నపిల్లలా చప్పట్లు కొట్టేశావు. నీ సంబరం చూడటం నాకు ఆ దృశ్యంకంటె ఆనందంగా ఉంది. అట్లా ఆ దృశ్యం చూస్తూ మధ్యమధ్య నావైపు చూస్తూ నవ్వేదానివి. మళ్ళీ పావురాల్ని చూసేదానివి. అట్లా చూస్తున్న నిన్ను చూస్తుంటే నాకు చీకటి పడ్తున్న సంగతికూడా తెలియలేదు. అంతలో మీనాన్న వాళ్ళుకూడా వచ్చి ఆ దృశ్యాన్ని కాసేపు చూశారు.

కొంచెం కొంచెం చీకటి పడుతోంది. అంతా కిందికి దిగుతున్నాం. నువ్వు నాపక్కగా నడుస్తున్నావు. నేను నీ పక్క నడుస్తుంటే నా అంత అదృష్టవంతుడు లేడనుకున్నాను. నాకు మహాభాగ్యం దొరికినట్లు అనిపించింది. అట్లా ఎంత దూరమైనా నడవాలనిపించింది. ఆ చీకట్లో నీ పైట నాకు తగిలినప్పుడు నా నెత్తురు జివ్వున పొంగింది. మనసు ఉల్లాసంగా ఎగిరింది.

కారు దగ్గరకొచ్చాక మీనాన్న అడ్రసిచ్చి పట్నం వచ్చినప్పుడు ఇంటికి రమ్మన్నారు. ఆమాటేగా నాకు స్వర్గద్వారాలు తెరిచింది. అవును. ఆ ద్వారాల్లోంచే నేను బయటికి తోసి వేయబడిందికూడా!

ఆ తర్వాత నేను బి.ఎ., పాసయాను. 'లా'లో చేరటానికి పట్నం వచ్చాను. వచ్చినప్పటినుంచి మీ యింటికి వద్దామని ఎంతో ఉబలాటం. కాని ఒకరకమైన సంకోచం ఒకసారి— మీ ఇల్లు ఉన్న రోడ్డుముందుగా వచ్చాను. బయటినుంచి చూస్తే లోపల ఎవరూ కన్పించలేదు. లోపలికి వద్దామంటే ఏదో బెరుకు. అంతలో ఎవరో మనుషులు బయటికి వస్తున్న అలికిడైంది. నేను గబగబా ముందుకు నడిచి వెళ్ళిపోయాను. ప్రతిరోజు నువ్వు జ్ఞాపకం వచ్చేదానివి. గుళ్ళో మెట్లెక్కి ఆఅరుగుమీద కూర్చొని నవ్వుకోటం జ్ఞాపకం వచ్చేది. గుళ్ళోగంటలు మోగుతున్నప్పుడు నువ్వు నావైపు ఆశగా చేతులు చాస్తున్నట్లు చూసిన చూపు జ్ఞాపకం వచ్చేది. నేను దొంగచాటుగా నిన్ను చూస్తున్నప్పుడు

నువ్వు గమనించి పెదవి నొక్కిపట్టి కోపంగా చూడటం జ్ఞాపకం వచ్చేది. పదే పదే అవే మనసులో కదిలేవి. నేను మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం తెచ్చుకొనేవాణ్ణి. ఆ జ్ఞాపకాలు ఎంత తియ్యటివి! అట్లా మననం చేసుకుంటుంటే కాలం తెలిసేది కాదు.

పొద్దున్నే లేవగానే ఈరోజు ఎట్లాఅయినాసరే మీ ఇంటికి రావాలనుకునేవాణ్ణి. సాయంత్రమయ్యేసరికి ఏదో అనుమానం మళ్ళీ రూముకు తిరిగివచ్చేవాణ్ణి. నాకు కొత్తవాళ్ళంటే భయంచేతకాదు. మీ నాన్నవాళ్ళు ఏమీ అనుకోరని తెలుసు. మరి ఎందుచేత వెళ్ళలేకపోతున్నాను. నేను వెళ్తాను భయం లేకుండానే మాట్లాడుతాను. నువ్వుచూస్తావు. నీకోసమే వచ్చానను కుంటావు. చులకనగా చూస్తావేమో! చూడవు. నాకు తెలుసు. సంతోషిస్తావు. కాని ఏవిటో భయం! దాన్ని పిరికితన మంటానికి వీల్లేదు. అదో బెరుకు! ఎందుచేతో ఏమో తెలియదు. అదొకరకమైన బలహీనత. ఇట్లా దాదాపు పదిహేనురోజులు గడిచిపోయినాయి.

ఒకరోజు సినిమాహాల్లో ఇంటర్ వల్ కి లైట్లు వెలిగాక వెనక్కి తిరిగి చూద్దునుకదా, నువ్వు మీ అమ్మ నాన్నా కుటుంబం కన్పించారు. మీ నాన్నగారు పలకరించినప్పుడు నేను కొంచం తడబడి పడ్డాను. వచ్చి ఇన్నిరోజులైనా ఇంటికెందుకు రాలేదని కొంచెం కోపగించుకొన్నట్లు మాట్లాడారు. నీ వైపు చూశాను. నీకళ్ళు రెపరెపలాడాయి. సిగ్గులో అలిసిపోయిన

పువ్వులా వున్నాయి నీకళ్ళు. నేను కళ్ళతోనే క్షమించమన్నట్లు చూశాను. బుజ్జగించాను. నన్ను మీాదు కూర్చున్న వరసలో కూర్చోమన్నారు మీానాన్న. మళ్ళీ సినిమా మొదలయింది. నాకు సినిమా కన్పించటం లేదు. నువ్వెందాక జాలిగా బాధగా చూడటమే జ్ఞాపకం వస్తోంది. నాకోసం నువ్వెంతకాలం ఎదురు చూస్తూ వున్నావని నాకు తెలియలేదు సుమా! నే నెంత వెర్రి వాణ్ణి! ఇంతకుముందే నీ దగ్గరికి రాకపోవటం ఎంత పొరపాటు! నువ్వెంత నొచ్చుకొన్నావో! నిన్ను దగ్గరికి తీసికొని నీ అలిసిన కన్నుల్ని ముద్దుపెట్టుకుందామనిపించింది. మీా నాన్న కవతలగా కూర్చున్న నీవైపు చూశాను. ఆ చీకట్లో నువ్వూ నావైపే చూస్తున్నట్లున్నావు. నీకూ సినిమా పట్టలేదు.

హాల్లోంచి బయటికొచ్చాక 'మా ఇంటికి వెళ్దాం రావయ్యా' అన్నారు మీానాన్న.

నా కెందుకో మళ్ళీ ఇదనిపించింది. 'రేపొస్తాలెండి నేనింకా భోజనం చెయ్యలేదు' అన్నాను. అదేం సమాధానమో!

'మా ఇంట్లోభోంచేద్దువుగాని' చటుక్కున అన్నావునువ్వు.

ఆ మాట నన్ను రమ్మని కౌగలించుకుంటున్నట్లుంది. 'నేనేం మాట్లాడలేక పోయాను. మీావెంట వచ్చాను.'

భోజనాలయ్యేంత వరకు నేను కొంచెం బెరుకుగా ఉన్నాను. 'సిగ్గుపడకు నాయనా' అని మీాఅమ్మ అనటం 'లేదులేదు' అని

నేను సిగ్గుపడుతూ జవాబు చెప్పటం, నువ్వు ఆసక్తిగా నవ్వటం ఇట్లా పనిసార్లన్నా అయింపికదూ!

నేను భోజనం ముగించి హాల్లో కొచ్చి కూర్చున్నాను. నువ్వూ కొంచెం సేపట్లో వచ్చేశావు. నాకోసం త్వరగా లేచి వచ్చావనిపించింది. ఇద్దరం ఎదురెదురుగా కూర్చున్నాం. నే నేమీ మాట్లాడలేక పోతున్నాను. నువ్వే కాస్సాగి అన్నావు 'ఊళ్లోకొచ్చి ఇన్ని రోజులయితే ఇవ్వాళ్టికి వచ్చారా?' అదీ సినిమాలో కనిపించబట్టి, మేం బలవంతం చేయబట్టి, లేకపోతే అసలు వచ్చేవారేనా?

నేను జవాబు చెప్పలేకపోయాను. ఇబ్బందిగా నవ్వాను తప్పుచేసిన వాడిలా.

నా సమాధానం రాకపోవటం చూసి 'అసలు మేం జ్ఞాపకం ఉన్నామా?' అన్నావు.

నే నాగలేక పోయాను 'అట్లా మాట్లాడకండి. నాది పొరపాటే' అన్నాను.

'అయ్యో! అంత మాటొద్దు...పోన్లెండి ఇవాల్టికైనా వచ్చారు.' నేను కాలేజీలూ తెరిచినప్పటినుంచి ప్రతిరోజూ మీా రొస్తారనుకునేదాన్ని అన్నావు.

నాలో ఒకరకమైన పులకరింపు కలిగింది. నేను కృతజ్ఞతగా నవ్వాను అంతలో మీానాన్న వచ్చి పేపరుతీసికొని వసా

రాలో ఉన్న కుర్చీలోకి చేరారు. నువ్వు మీఅమ్మ తీసికొచ్చి ఇచ్చిన ఆకులకి సున్నంరాస్తున్నావు. నువ్వు ఆకుల ఈనలుతీస్తూ మధ్యమధ్య నన్నుచూసి నవ్వుతున్నావు. కొంచెం సిగ్గుపడుతున్నట్టు నవ్వావు. ఎందుకో ఆరాత్రి ఇంటికివెళ్ళి ఆలోచించుకుంటేగాని తెలిసిందికాదు. నువ్వేదన్నా మాట్లాడితే బావుండుననిపించింది. పోనీ నేనే మాట్లాడుదామనుకొన్నాను. ఏం మాట్లాడాలో తెలిసిందికాదు. మీనాన్న పేపరు చూస్తున్నాడో నన్ను చూస్తున్నాడో అంతకంటె తెలిసిందికాదు. పేపరు చూడ్డం ఆపేసి మీనాన్న ఆకువేసుకోటానికి మా దగ్గిరికి వచ్చారు. ఆయన మాపెద్ద వాళ్ళ గురించి కుటుంబం గురించి అడిగారు. ఇంటిపేరు వివరాలు అడిగారు. ఎక్కడో దూరపు బంధుత్వం కలిసిందని, సంతోషించారు. నిజమే! నాకూ సంతోషం వేసింది. నాకు నువ్వు ఆకులిచ్చావు. ఆనందంగా వేసుకున్నాను. అందులో ఏంపెట్టావో అంత అమృతమయంగా ఉన్నాయి. నువ్వు ఆకులు నములుతూ మధ్యమధ్య నాలుక బైటపెట్టి పండిందో లేదో అని చూసుకున్నావు. అందులో నన్నుచూసి వెక్కిరింపుకూడా ఉంది. ఎర్రని నీ పెదవులు మెరుస్తున్నాయి. తాంబూలం అదృష్టవంతురాలు! కళ్ళుచికిలించి చిలిపిగా నవ్వావు. నేను పెదవి నొక్కిపట్టి మూగగా బెదిరించాను. మూగగా ఒకళ్ళ కొకళ్ళం కవ్వించుకుని నవ్వుకున్నాం. నీ తాంబూలం పెదవులపైన నవ్వులు చిందులు తొక్కుతున్నాయి. అట్లానిన్ను చూస్తూ కూర్చుంటే చాలు. ప్రపంచంలో నాకింకేమీ అక్కరలేదనిపించింది. నైటుం

తెలియలేదు. మీ నాన్న ఆవులిస్తూ లేచారు. ఇహ బాగుండదని నేనూ లేచి 'వస్తా' నని చెప్పాను. 'తరుచు వస్తూఉండు. పరాయి వాళ్లంకాదు' అన్నారు మీనాన్న. ఆమాటే మీఅమ్మ గుమ్మం లోంచి మళ్ళీ ఇంకోసారి చెప్పింది. 'శలవు' అని వాకిట్లో నడిచాను.

నడుస్తూ ఆలోచిస్తే నీకు చెప్పిరాలేదని తెలిసింది. ఎట్లా నీకు చెప్పటం! బయట తెల్లటి వెన్నెల! గేటు దాటుతూ ఒక్క సారి వెనక్కు తిరిగి చూశాను. కిటికీలోంచి నువ్వు గేటువైపు చూస్తూ కన్పించావు. ఒక్కపరుగున కిటికీదగ్గరకొచ్చాను. 'నేను వెళ్ళనా' అన్నాను పండిన నీ పెదవులవైపు చూస్తూ. నువ్వు కొంచెం కంగారు పడ్డావు. ఎవరైనా చూస్తారేమో 'వస్తాను' అని కిటికీలో ఉన్న నీచెయ్యిమీద చెయ్యి వేశాను. నువ్వు సర్రున వెనక్కు లాగేసుకున్నావు. నీ ముఖంలోకి చూశాను. విచ్చిన పువ్వుల్లా నీకళ్లు. వెన్నెలలా నీ చిరునవ్వు! 'వస్తా' అని చెప్పి గేటు దాటుతున్నాను. గేటు దాటుతున్న ప్పుడు నువ్వు కిటికీలోంచి చెయ్యిఊపుతున్నావు.

నేను ప్రతి ఆదివారం మీ ఇంటికొస్తూ ఉండటం అల వాటైపోయింది. నువ్వే అన్నావు ఒకసారి ఆదివారం మధ్యా హ్నం నువ్వొస్తావని ఎదురుచూడ్డం నాకు జీవితంలో ఓ భాగ మైపోయిందని. ఆదివారం ఎప్పుడొస్తుందా అని వారమంతా ఆరాటపడేవాణ్ణి. పొద్దుపోయేదాకా మీ ఇంట్లో కబుర్లు చెప్ప

కుంటూ ఉండటం ఒకటికి రెండుసార్లు టీలు తాగటం మీా దొడ్లో ఇద్దరం కలిసి చెట్లకి నీళ్లుపోయటం అలిసిపోయి పారి జాతం చెట్టుకింద కూర్చొని విశ్రాంతి తీసికోటం నే నెప్పటికీ మర్చిపో లేను.

ఒక ఆదివారం మధ్యాహ్నం నీకు జ్ఞాపకముందా, నేను వచ్చేప్పటికి నువ్వు ఎప్పటిలాగా వసారాలో కూర్చుని నా కోసం ఎదురు చూట్టం లేదు. నేను కొంచెం ఆశ్చర్య పోయాను. వసారాలో ఎవ్వరూ లేరు. నేను కుర్చీలో కూర్చుని కాసేపు పేపర్ తిరగేశాను. నువ్వు గదిలో పడుకుని ఉండాలి లేకపోతే బైటికైనా వెళ్ళుండాలి అనుకున్నాను. ఎవర్నయినా అడుగు దామంటే ఎవరూ కన్పించటం లేదు. నాకు విసుగొస్తోంది. అంతలో మీాఅమ్మ ఆపక్క నొచ్చి 'ఎంతసేపయింది నాయనా' వచ్చి అంది. గదిలోకెళ్ళి నిన్ను లేపింది. నువ్వు విసుక్కుంటు న్నావు. నా మనస్సు కలుక్కుమంది. నువ్వు నిద్రకళ్లతో వచ్చి నా ముందు కూర్చున్నావు. నువ్వు ఎంచేతో ఉత్సాహంగా లేవు.

'ఒంట్లో బాగు లేదా ?' అన్నాను.

'బాగానే ఉంది' అని తుంచినట్లు సమాధానం చెప్పావు.

నాకు ఆ సమాధానం గుచ్చుకుంది. ఈ నిరాదరణ ఎందుకో తెలియ లేదు. నేను చులకనై పోతున్నా నేమోనని అను

మానం. నేను వచ్చి నీకు ఇబ్బంది కలిగిస్తున్నానేమో ! నేను కుంగిపోతున్నాను.

'కాఫీ తీసికెళ్ళవేమో ?' అంది మీ అమ్మ ఇంట్లోంచి.

'ఊఁ' అని విసుగ్గా లేచివెళ్ళావు నువ్వు.

నాకు ఛెళ్ళున చరిచినట్లయింది. లేచి వెళ్ళిపోదామను కున్నాను. అంతలో నువ్వు కాఫీ కప్పుల్తో వచ్చావు. ఒకటి నాముందు పెట్టి తీసుకోమ్మనైనా అనకుండా నువ్వు కాఫీ తాగు తున్నావు. ఎంత నిర్లక్ష్యం ! నేను కాఫీ ముట్టుకోలేదు. నాకు లోపల కోపం రగుల్తోంది. నువ్వు తాగుతూ సగంలో 'నువ్వు కాఫీ తీసుకోలేదేం ?' అన్నావు. ఆ అడగటం ఆధోరణి నాకు గౌరవంగా కన్పించలేదు.

'నేనిప్పుడే తీసుకొచ్చాను' అన్నాను.

'పర్వాలేదు. ఇంకోసారి' అన్నావు నువ్వు. ఏవిటి ఏదో ఆజ్ఞలాగా. నాకు చెడ్డకోపం వస్తోంది. కప్పు విసిరేద్దామనుకు న్నాను. తమాయించుకున్నాను. కానీ అని కాఫీ తాగాను. ఎవ్వరం కాస్సేపు మాట్లాడలేదు. నాకు చిరాగ్గాఉంది. నిశ్శబ్దం దుస్సహంగా ఉంది.

'ఏమిటి అలావున్నావు' అన్నాను.

'ఏం బాగానే వున్నానే' అన్నావు రెప్పలార్పిస్తూ.

నాకు చాచి కొట్టాలనిపించింది. క్వీన్ విక్టోరియాలా ఆ సమాధానమేమిటి ? నాకు నవ్వొచ్చింది. నీమీద నాకు కోపమేమిటి ? నవ్వులాటలోకి దింపాను.

'ఇవ్వాళ నాకేదో కొత్తమ్మాయి దగ్గర కూచున్నట్లుంది' అన్నాను.

'ఊహు' అని కొంచెం నవ్వావు. నాకొంచెం ఊరట కల్గింది.

'సినిమా కెళదామా' అన్నాను.

'ఊహు' అని తలతిప్పావు.

'ఏం?' అన్నాను.

'ఇప్పుడు కాదు. ఇంకోసారి అన్నావు.

ఈ ముక్తసరి సమాధానాలు ఈ ధోరణి నాకేమీ అర్థం కావటం లేదు. నేనెంత ఆపుకుందామనుకున్నా కోపం ఆగటం లేదు.

'ఇవ్వాళ పొద్దుట నువ్వెవరిమీద యుద్ధం చేశావ్... అదే ఎవరితో పోట్లాడావ్ ?' అన్నాను.

'నే నెవరితో పోట్లాడలేదు. అయినా నే నెందుకు పోట్లాడుతాను?' అన్నావు.

'అహ. పోట్లాడ్డం పెద్ద నేరమేంకాదుగా. పైగా హక్కు కూడాను.' అన్నాను.

'పోట్లాడాల్సిన అవసరం నాకేం లేదు' అన్నావు.

'బహుశా నే నొచ్చాకే ఆ అవసరం కలిగిఉంటుంది.' అన్నాను. నువ్వు కళ్ళు పైకెత్తి చూశావు' అంతే నీతో నేను పోట్లాడుతున్నానా?' అన్నావు.

నాకు మరీ నవ్వొస్తోంది. 'లేదు...ధోరణి అట్లావుంది.

'నా ధోరణే అంత. ఆ సంగతి నీ కీపాటికి తెలిసే ఉండాలి' అన్నావు పెద్ద గొంతుకతో.

'తెలిసింది...తెలిసింది...రోజూ కొన్నికొత్తరంగులు...'

'రంగులా...రంగులేమిటె...ఏవిటా మాటలు రామం?' నువ్వు రెచ్చిపోయి అడిగావు.

నేను తెల్లబోయాను. నీకంత కోప మెందుకొస్తుందో తెలియదు. నువ్వు కావాలని నాతో పోట్లాడుతున్నావేమో అనిపించింది.

'సారీ సుశీ!...ఏదో అనేశాను' అన్నాను.

'అనటమే నీవంతు. బాధ నీదికాదుగా' అన్నావు.

నాకు చిర్రెత్తుకొచ్చింది. 'ఏవిటి సుశీ! ఎందుకట్లా అనవసరంగా కెలుకుతావు. నీ కిష్టం లేకపోతే నన్ను వెళ్ళిపొమ్మని చెప్పరాదూ' అన్నాను.

అంతలో మీనాన్న వసారాలో కొచ్చారు! 'అమ్మాయ్! బావనుంచి ఉత్తరం వచ్చిందా' అంటూ.

నువ్వు కొంచెం తుళ్ళిపడ్డావు. కంగారు పడుతూ 'ఆ... ఆ' అన్నావు.

'వాడి అడ్రస్ మారిందటగా చెప్పు ఉత్తరం రాయాలి' అన్నారు మీనాన్న.

నువ్వింకా కంగారు పడుతున్నావు. భయంగా ఒక రెప్ప పాటు నావైపు చూసినట్లు జ్ఞాపకం. లోపలి కెళ్ళొచ్చి మీనాన్నకి చెప్పావు 'శేఖరం...హైదరాబాద్ అంటూ!...'

మీనాన్న లోపలి కెళ్ళారు. నాకిప్పుడు కొంచెం అర్ధమవుతోంది. ఈ నీ వాలకానికి కారణం. మీబావ శేఖరం నుంచి ఉత్తరం వచ్చింది. ఏం రాసుంటాడు? వెనకెప్పుడో మాటల సందర్భంలో మీనాన్న చెప్పినట్లు జ్ఞాపకం. ఆయన చెల్లెలకొడుకు హైదరాబాద్‌లో ఇంజనీరింగ్ చదువుతున్నాడని. నాకు అనుమానం వేసింది. బాధకల్గింది. నీధోరణి, నీమౌనం నాకు మరీ విచారం కల్గిస్తోంది. నిన్ను కావాలని కదిలించాను.

'మీ శేఖరం బి.ఇ. పూర్తయిందా?' అన్నాను.

నా నోట శేఖరం పేరు రాగానే నువ్వు ఉలిక్కిపడ్డావు. 'ఇంకా లేదు' అన్నావు.

'ఇప్పుడే ఇయర్?' అన్నాను.

'ఏదో పోనిద్దూ' అన్నావు.

'నేను తట్టుకోలేకపోయాను. ఏమిటి నాకీ అవమానం? నేనేం తప్పు చేశాను? నువ్వు నాకు దూరమైపోతున్నావేమో అన్న అనుమానం గుండెలు పీకుతోంది. నేను నిన్ను వదులుకోలేను... కాని ఏం చెయ్యను... ఏమీ మాట్లాడలేకపోయాను. నువ్వు మాట్లాడలేదు. కాస్తాగి లేచి నిలుచున్నాను! 'వెళ్తా' అన్నాను.

నువ్వు సమాధానం కూడా చెప్పకుండా తలూపావు. నువ్వు నవ్వలేదు. సంతోషంగా చెయ్యి ఊపలేదు. సాయంత్రం కాలేదు... పారిజాతాలు లేవు. నేను నలగరా వచ్చి గదిలో పడిపోయాను.

ఆ రాత్రి భోజనం చెయ్యలేదు. తెల్లవార్లూ నిద్రపట్టలేదు. నా అనుమానాలు నిజమా? నా సుశీ నాకన్యాయం చేస్తుందా? ఇవే ఆలోచనలు. ఒళ్ళంతా నొప్పులు. మనస్సులో వ్యథ.

ఉదయాన హోటల్ సర్వర్ కాఫీ తీసికొచ్చాడు. నేను పిలిస్తే పలకపోవటం చూసి తట్టి లేపాడు. ఒళ్ళు పట్టుకుచూసి జ్వరం వచ్చిందన్నాడు. నిజమే ఒళ్ళు కాలిపోతుంది. బహుశా రాత్రికూడా జ్వరం ఉండి ఉంటుంది. నీకు కబురు పెడ్దా మను కున్నాను. మళ్ళీ ఆ ఆలోచన. తెంపుకున్నాను. కాఫీ తాగేసి మళ్ళీ కళ్ళు మూసుకున్నాను.

కాసేపటికి నా నుదుటికి చల్లగా ఏదో తగిలింది. అది నీ చెయ్యి. నువ్వొచ్చావు... నాకోసం వచ్చావు... నన్ను చూడ్డాని కొచ్చావు... నేనెంత పొంగిపోయాను. నిన్న నీ అను రాగాన్ని అనుమానించానా...అయ్యొయ్యొ! నువ్వు జాలిగా ఓదార్పుగా చూస్తున్నావు. నీ కళ్ళు బాధగా కొట్టుకుంటు న్నాయి. నా ముఖమంతా నిమురుతున్నావు. నా మనసు హాయిగా ఊగుతోంది. ఈ అకస్మాత్ అమృతవర్షానికి తట్టుకో లేకపోయాను. నా కళ్ళంట కన్నీళ్లు.

'వద్దు...వద్దు...' అన్నావు నువ్వు ముఖం దగ్గరగా పెట్టి.

కాని కన్నీళ్లు ఆగటం లేదు. నువ్వు కొంగుతో పదే పదే తుడుస్తున్నావు. కాని కన్నీరు ఆగదు. నువ్వు గిజగిజలాడి పోయావు. 'వద్దు...వద్దు' అన్నావు. నా చుబుకం పట్టుకు

బుజ్జగించావు. నా తల ఒళ్లోకి తీసికొన్నావు. నా కన్నీటి పెద వులు ముద్దుపెట్టుకున్నావు. నీ ముఖంమీద కూడా కన్నీరు. నన్ను మరీ దగ్గరికి తీసికొన్నావు.

నేను ఆపుకుని ఆపుకుని అన్నాను'...సుశీ...నా కన్యా యం...చెయ్యవుగా...'

'అయ్యో...వద్దు...' నన్ను గట్టిగా హత్తుకున్నావు... నీ కన్నీటి ధారల తడి నాకు తెలుస్తోంది. నీ వెచ్చటి పెదవులు నన్ను పదేపదే తాకుతున్నాయి. 'వద్దు...మర్చిపో రామం... నిన్న అలా అయిపోయింది... నా మనసు బాగులేదు...' అన్నావు.

అబ్బ! నీ మనసు ఎంత తేలికైంది. నీ కౌగిట్లో ఒదిగి పోయాను చిన్నపిల్లాడ్నైపోయి ముఖాన్ని నీ వక్షాల్లో దాచు కున్నాను.

నాలుగురోజుల తర్వాత మా వూరికి వెళ్ళాల్సి వచ్చింది నీకు చెప్పటానికి మీ ఇంటికొచ్చాను. 'నేనూ రానా' అన్నావు నువ్వు. 'తప్పకుండా' అన్నాను. ఆమాట నాకు ముందే తట్టలేదే నేనే అడిగేవాణ్ణి అనుకున్నాను. కాని మీఅమ్మ నాన్న పంప తారో లేదోనని అనుమానం. ఎంతచెడ్డా పెళ్ళికావలసినదానివి గదా! బహుశా నీ ఉత్సాహంచూసి కాబోలు వాళ్ళు అంత అభ్యంతరం పెట్టలేదు.

మా అమ్మ నిన్ను చూసి ఎంత సంతోషించింది! ఆ ఇంటికి ఏ ఆడపిల్ల వచ్చినా ఆవిడకి కోడలులా కన్పిస్తుంది. ఆ పిల్లతోటి ఆ ఇంటి వ్యవహారాలన్నీ చెప్తుంది. ఆ ఇంటి బాధ్యతలన్నీ అప్పగిస్తున్నట్లు మాట్లాడుతుంది. నువ్వు అక్కడున్న నాలుగు రోజులు ఆఇంటి కోడలివే ననిపించావు. నువ్వు వంటలో ఆవిడకి సాయం చెయ్యటం ఆవిడ నిన్ను ఏ చిన్నపనీ చెయ్యనివ్వకుండా చూడ్డం నాకు బలే సరదాగా ఉండేది.

ఒకరోజు సాయంత్రం ఇద్దరం కృష్ణలో పడవ షికారు కెళ్ళాం. ఆచిన్న డింగీలో ఎదురెదురుగా కూచ్చున్నాం. రయ్యిన గాలివాలుకి నీళ్ళని తోసుకొంటూ ముందుకెళ్ళిపోతోంది డింగీ. ఆ నల్లటి నీళ్ళని, మన్నిదాటి పోతున్న తెఱచాప పడవల్ని దూరంగా ఉన్న ఇసుక తిన్నెల్ని మౌనంగా చూస్తున్నావు నువ్వు. సంధ్య కిరణాలు నీమీదపడి మెరుస్తున్నాయి. ప్రశాంత నదీ సుందరిలా వున్నావు నువ్వు. అలలు అలలుగా పొంగుతున్న జాలులా ఉంది నా మనస్సు.

అంతలో ఉత్తరాన ఉరిమింది. నా కెంపుకో భయమేసింది. ఇద్దరం అటు చూశాం. నల్లగా మబ్బులు కమ్ముకుంటు న్నాయి. పడవ ఒడ్డుకు చేర్చమన్నాను. సన్నగా తుంపర ఆరంభమైంది. తొందరగా రేవులోకి పోనిమ్మన్నాను సరంగుతో. గాలి పెడసరంగా ఉంది. సరంగు ఆ గాలిలో పడవని రేవుకి మళ్ళించటానికి యాతన పడ్తున్నాడు. జల్లు పెద్దదైంది. దబదబ వరం

కురుస్తోంది. ఇద్దరం ఒకచోటికి వొచ్చి కూర్చున్నాం. వర్షం జోరెక్కువయింది. సందులో తాటాకు గొడుగు కూడా లేదు. తడిసిపోతున్నాం ఇద్దరం. దగ్గరగా జరిగి కూర్చున్నాం. నేను వణుకుతోందని చేస్తున్నాను. అత్తన్ని కంగారు పెట్టటంవల్ల ప్రయోజనం లేదనిపించింది. చీకటి పడుతోంది. వర్షంమరీ ఎక్కువయింది. ఆకాశంలో ఉరుములు ఎక్కువగా నల్లగా అవతలొడ్డు కన్పించని కృష్ణ. పైన ధారాపాతంగా వర్షం. నాకు మనిద్దర్నీ పూర్తిగా తడిసేసింది. కృష్ణ హోరు, వానహోరు, మాటలు సరిగా విన్పించటం లేదు. పడవ వేగం ఊగుతోంది. ఇద్దరం మరీ దగ్గరిగా జరిగాం. నిన్ను కౌగిట్లో ఇముడ్చుకున్నాను. నువ్వు కౌగిల్ని బిగించావు. నీ భయపడుతున్న గుండెల చప్పుడు నా గుండెలకి సోకుతోంది. నువ్వు భయంతో మూసుకున్న కళ్ళని నా పెదవులు బుజ్జగిస్తున్నాయి. నువ్వు చలికి తట్టుకోలేక కాబోలు వణుకుతున్నావు. నిన్ను మరీ దగ్గరికి తీసికొన్నాను. ఆ చలిలో, ఆచీకట్లో, ఆ వర్షంలో, ఆ కృష్ణ నడుమ, నా అరచేతుల్లో నీ ఒళ్ళంతా నిమిరాను. పడవ స్పీడు పోతోందన్న ధ్యాసే నాకు లేదు.

ఆరాత్రి పన్నెండింటికి ఇంటికిచేరాం. నువ్వు తూలిపోతూ నన్ను పట్టుకుని నడిచావు. గడపదగ్గర చిమ్నీబుడ్డీ పెట్టుకుని మా అమ్మ మనకోసం ఎదురుచూస్తోంది. మనం తలలు తుడుచుకుని బట్టలు మార్చుకుని భోజనం చెయ్యను కూర్చున్నాం. అన్నం చల్లగాఉంది. అమ్మ రాత్రికి వేడి కూరలు ఏవీ చెయ్యలేదు.

మధ్యాహ్నం కూరలే వడ్డించింది. నువ్వు అసలేం తినట్లు లేవు. నాకు అమ్మమీద కోపమొచ్చింది. అప్పుడు ఆవిడకూడా పెద్దదై పోయింది!

వర్షం తగ్గలేదు. ఇంకా ఆపకుండా గొల్లున కురుస్తోంది. నువ్వు అదేపనిగా తుమ్ముతున్నావు. అసలు మాట్లాడటంలేదు. నీ కేమయినా చేస్తుందేమోనని భయంవేసింది. అమృతాంజనం రాసుకుని పడుకోమన్నాను. నీకు మంచి దగ్గుకూడా లేదు. నిన్ను బాధపెడ్తున్నానే అనిపించింది. కాని ఏం చేస్తాను? అలాగే పడు కున్నాను. ఒకరాత్రివేళ లేచి చూద్దునుకదా నువ్వు కూర్చుని జోగుతున్నావు. పక్క చుట్టేసి ఉంది. నీచుట్టూ బొట్లు బొట్లుగా నీళ్ళు పడుతున్నాయి. ఇల్లు కురుస్తోంది.

'ఇటొచ్చి పడుకో సుశీ!' అన్నాను.

'అవసరంలేదు. సర్దుకుంటాను.' అన్నావు ఆ సమా ధానంలో విసుగు, కరుకుతనం. నే నింకేమీ మాట్లాడలేదు.

మర్నాడు నాకు మెలకువ వచ్చేప్పటికి ఎనిమిదయింది. నువ్వు అప్పటికే ప్రయాణమయి సిద్ధంగాఉన్నావు. నేను ఆశ్చర్య పోయాను. 'అప్పుడే వెళ్తావా?' అన్నాను.

'అవును. వెళ్ళిపోతాను' అన్నావు నువ్వు ముక్తసరిగా.

నువ్వు ముభావంగాఉన్నావు. నేనింకేమీ మాట్లాడలేక పోయాను. ఆ మౌనంతోనే నిన్ను బస్సెక్కించాను. నేను పట్నం వచ్చాక నువ్వు మామూలుగా నవ్వుతూమాట్లాడటంచూశాక కాని నా మనసు కుదుటపడలేదు. కాని నీమాటల్లో అప్పు డప్పుడు కన్పించే రిజర్వేషన్‌కి మూలం ఆనాటి మౌనమే అని పిస్తుంది.

ఆరోజు...నా దురదృష్ట ఘడియలు మొదలయినరోజు ...ఆ సాయంత్రం పిక్చర్‌కి వెళ్ళామనుకున్నాం. నేను ఐదు ఐదున్నరకే మీ ఇంటికొచ్చాను. ఇల్లు హడావుడిగా ఉంది. చుట్టాలు వచ్చినట్లున్నారు. బయట సామాన్లు పెట్టివున్నాయి. హాల్లో నువ్వు కన్పించలేదు. మీ నాన్నగారు ఏవో కాగితాలు చూసుకుంటున్నారు.

'రావోయ్...రా...మా శేఖరం హైదరాబాద్ నుంచి వచ్చాడు' అని కుర్చీచూపించి మళ్ళీ ఆయన కాగితాలుచూసు కోటంలో పడ్డారు.

ఎందుకో నాగుండె అనవసరంగా కొట్టుకుంది. లోపలినుంచి నీ నవ్వు తెరలు తెరలుగా విన్పిస్తోంది. ఏదో కొత్తగొంతు మాటలు విన్పిస్తున్నాయి. ఎంతసేపటికీ నువ్వు లోపల్నించి రాలేదు. ఇదివరకు నువ్వు హాల్లో కన్పించకపోతే సరాసరి గదిలోకి వచ్చేవాణ్ణి. ఇప్పుడు అలా రావటానికి భయపడ్డాను.

మీ అమ్మ హాల్లోకి వచ్చి నన్ను చూసి వెళ్ళింది. నేనొచ్చానని ఆవిడ చెప్పిందో లేదో తెలియదు. నువ్వుమాత్రం ఊహాపోహ లేదు. మీనాన్నకూడా మాట్లాడకుండా కాగితాలు చూసుకుంటున్నాడు.

ఓ పావుగంట తర్వాత ఏదో తీసికెళ్ళడానికి హాల్లోకొచ్చి నన్ను చూశావు. 'ఓ! రామం! ఎంతసేపయింది వచ్చి?' అన్నావు.

'ఇప్పుడే' అని లేచొచ్చాను.

నీముఖం అంత సంతోషంగా లేదు. నీకళ్ళు నన్నుకొంచెం అయిష్టంతో చూస్తున్నట్లనిపించింది.

'ఇవ్వాళ చుట్టాలొచ్చారు రామం! పిక్చర్ ప్రోగ్రాం పడదు' అన్నావు నువ్వు నేలచూస్తూ.

నేనేమీ మాట్లాడలేకపోయాను. చుట్టాలొచ్చారు అని చెప్పొచ్చుగా. నన్ను చూపించి పరిచయం చెయ్యొచ్చుగా అనుకున్నాను. కాస్సాగి తీసుకున్న మాగజైన్లు వలుపుతూ 'నే వెళ్తా' అన్నాను. అంటే నన్ను వెళ్ళిపొమ్మనేగా అర్థం. ఇక నేనుండలేక పోయాను. నేనే సమాధానం చెప్పలేను. నువ్వు అలాగే నుంచున్నావు ఇంకా వెళ్ళలేదేం అన్నట్టు. కావాలని నా బొమ్మ

గీసి ఆ చేతుల్తోనే ఎందుకు చెరిపేస్తున్నావో అర్థంకావటంలేదు. నేను వచ్చేశాను. అదే మొదలు మనం దూరమై పోవటానికి.

ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. ఆ మర్నాడు ఆదివారం. నేను పెందలాడే మీ ఇంటికొచ్చే రోజు. వెళ్ళనా వద్దాఅని మధన పడ్డాను. ఆలస్యంగా నాలుగింటికొచ్చాను. హాల్లో మీ అమ్మ ఎదురై 'సినిమాకి వెళ్ళారు నాయనా!' అంది. నేను కుంగిపోయాను. ఎవరెవరు వెళ్లారో చెప్పలేకపోయేదు. నేను తిరిగొచ్చేస్తుంటే 'ఉండు. కాఫీ తీసుకు వెళ్ళుగాని' అంది మీఅమ్మ. ఇష్టం లేకపోయినా మర్యాదగా ఉండటాని కాఫీతాగి వచ్చేశాను. పార్కులో తెగ తిరిగాను. అశోక చెట్టుచాటున కూర్చొని వ్యధ పడ్డాను. కళ్లలో నీళ్లు తిరిగినై. నన్నింత నిర్దాక్షిణ్యంగా తోసేశావు? మనసు కుదుట్పడేదాకా అవకాశమే లేకుండా ఉన్నట్టుండి నన్ను బయటికి పొమ్మనటం న్యాయమా? పొద్దు పోయాక పార్కు బయటికి నడిచొచ్చాను. రోడ్డుకవతలగా నువ్వు కన్పించావు, నీ పక్కనే సూటులో ఒకతను బహుశా మీ బావ. ఇద్దరూ ఒకే రిక్షాలో వెళ్ళి పోయారు. నా గుండెలు పిండేసినట్లైంది.

ఆ రాత్రి నేను భోజనం చెయ్యలేదు. నాకు సర్వం తల్లకిందులై పోతున్నట్లనిపించింది. ఇంత బాధలోను ఇన్ని అనుమానాల్లోనూ ఒక్క విషయం అనిపించేది నువ్వు నన్ను కాదనలేవని. అదే ఊరట. అదే నా ఆశల ఊపిరి. నాలుగు రోజులుగా కాలేజీ-

ఇంటికి రాలేదు. నేను బయటికి పోలేదు. ఒకరోజున మీ నౌకరొచ్చిచెప్పాడు అయ్యగారు పిలుస్తున్నారని, ఎందుకోఅర్థంకాలేదు. నేను వచ్చేసరికి హాల్లో మీనాన్న, మీబావ కూర్చుని ఉన్నారు. మీనాన్న పరిచయం చేశాడు. మీ శేఖరం మంచి సూట్లో సీట్‌గా ఉన్నాడు. నేను అతనంత అందంగానూ లేనూ, ఎప్పుడు సూట్లు వెయ్యలేదు.

హైదరాబాద్‌లో మా చుట్టాలెవరో నన్ను గురించి అడిగారుట. చూద్దామని కబురు పంపించారు. శేఖరం తిరుగు ప్రయాణం కట్టాడు. స్టేషన్‌కి అంతాకలిసి వెళ్ళాం. అతను వెళ్ళిపోతున్నాడంటే నాకెంతో హాయనిపించింది. ట్రైన్ కదిలేవరకు నువ్వు అతని సీట్ దగ్గరగా జరగటం మీ రిద్దరూ సన్నగా మాట్లాడుకోటం నాకు గుచ్చుకుంది. నేను అతన్నిచూసి అసూయ పడ్తున్నానేమో! మీ రిద్దరూ మాట్లాడుకోటం ముఖ్యంగా అంత ఆత్మీయంగా– చూసి సహించలేక పోతున్నాను. దానికి కారణం ఒకటే. నీయందున్న గాఢమైన కోరిక. దానికేమాత్రం భంగం కలిగినా నిబ్బరించుకోలేక పోతున్నాను. కాని ఓ పిచ్చినమ్మకం నా సుశీ నన్ను కాదనదు...సుశీ నాది...

ఆ తర్వాత కలుసుకున్నప్పుడు అడిగాను నిన్ను. 'శేఖరం వచ్చినప్పుడు నన్నసలు మర్చిపోయావే? అని నవ్వుల్లో పెట్టి.

'అదికాదు రామం. రాక రాక వచ్చాడు. అక్కడికి ఇక్కడికి వెళ్దామనేవాడు. ఎంటర్ టెయిన్ చెయ్యాలిగదా! కాని

ఎక్కడికి వెళ్ళినా నువ్వు జ్ఞాపకంవచ్చి బాధ పడేదాన్ని. కాని ఏంచేస్తాను చెప్పు' అన్నావు.

'పోన్లే' అన్నాను. నా మనసు పావురంలా హాయిగా ఎగురుతోంది.

'శేఖరం మంచివాడుకదూ?' అన్నాను.

'చాలా మంచివాడు. సంస్కారం ఉన్నవాడు. ఎంత ఎంగేజింగ్‌గా మాట్లాడుతాడని-ఛార్మింగ్ ఇంగ్లీష్' అన్నావు.

నేను ఆవిషయం ఆపి టాపిక్ మార్చేశాను. మనపెళ్ళి సంగతి నిన్న స్పష్టంగా అడిగేద్దామనుకున్నాను. కాని అంతలో మీ నాన్న పిలిచారు. నువెళ్ళిపోయావు. నిన్ను త్వరలో...వెంటనే ఆప్రశ్న అడగాలని...నీ నుంచి స్పష్టంగా సమాధానం అందుకోవాలని తొందర పడుతున్నాను. ఎప్పుడడుగుదామనుకున్నా ఏదో అడ్డుకు వచ్చేది. అట్లా వారం గడిచిపోయింది. ఎంత లేదనుకున్నా ఈ వారంరోజుల నీ నడవడి పరిశీలిస్తే నువ్వు నాతో వెనకటంత చనువుగా లేవు. అయినా నేనంతగా బాధ పడలేదు. నీవు నాదానివి. ఆ సోగకళ్ళు నావి. ఆ ఎర్రటి చిట్టి పెదవులు నావి. నీ చేతులు నన్ను కౌగలిస్తాయి. నీ జడలో పువ్వుల్ని నేను సమాశ్వాసిస్తాను. నీ వెచ్చటి వక్షాల్ని నాగుంకి హత్తుకుంటాను. నీ ముంగురుల్ని నిమురుతాను. నీ పక్కన

పడుకుని ఆకాశాన్ని చుక్కల్ని చూస్తాను. బ్రతుకులో ప్రతి క్షణాన్ని నీతో కలిసి అనుభవిస్తాను- ఇలాతప్ప ఇంకోరకంగా జరగటానికి వీల్లేదు.

ఆ మర్నాడే మీరంతా హైదరాబాదు వెళ్ళారు. మళ్ళీ నా అనుమానాలు మొదలు.

హైదరాబాద్ వెళ్లి ఉత్తరాలు రాస్తానన్నావుగదూ! వాటికోసం రోజూ ఎదురు చూసేవాణ్ణి. నువ్వు రెండుత్తరాలు రాశావు. ఈరోజు చార్మినార్ చూశాం. ఈ సాయంత్రం టాంక్ బండ్ కి వెళ్ళాం. ఇవ్వాళ గోల్కొండ వెళ్ళాం. నీచదువెలాఉంది- ఇవీ. ఇవేనా నువ్వు రాయాల్సింది? ఉత్తరాలు చించేద్దామని పించింది. ఏదో కొత్తగా పరిచయమైనవాళ్ళకి రాసిన ఉత్తరాల్లా ఉన్నాయని రోజులు గడుస్తున్నకొద్దీ నాకు మరీ దూరమైపోతు న్నావనిపిస్తోంది. పరీక్షలకి అసలు చదవలేదు. నిండు నెలరోజులు మీరు హైదరాబాద్ లో ఉన్నప్పుడు నే నిక్కడ పిచ్చివాడిలా తిరిగాను. మీరు తిరిగొచ్చారని మీ బంధువొకడు బజార్లో చెప్పాడు. పరుగెత్తుకుని మీఇంటికి కొద్దామనుకొన్నాను. అత గాడే నీ పెళ్ళి శుభలేఖకూడా చూపించాడు......అదే నా నెత్తిన పిడుగు......

నువ్వు శేఖరాన్ని పెళ్ళి చేసికోటానికి నిర్ణయించు కున్నావు. బహుశా అతన్ని చేసికొంటేనే ఎక్కువ సుఖపడతా

చేసుకొని ఉండొచ్చు. హాయిగా బోలెడంత ఆస్తి కార్లు పెద్ద ఉద్యోగం. నన్ను చేసుకొంటే ఏముంది? ఆ పల్లెటూర్లో ఆపాత ఇంట్లో ఉంటూ గొడ్లల్లోనూ దుబ్బుల్లోనూ పడి తిరగటమేగా. అయితే నాకెందుకంత ఆశపెట్టావ్. నువ్వు నాదానివే అన్నట్లు ప్రవర్తించావే. ఉన్నట్లుండి నాకుత్తుక ఎందుకు కత్తిరించావ్?...

అయిపోయింది సుశీ...అయిపోయింది. పువ్వులు వాడిపోయాయి. తెల్లటి వెలుగురేకలు పాలి పోయాయి. బతుకులో జీవంపోయి శవంలా నేను బ్రతకలేను. ఎవరి చుట్టూ నా బ్రతుకంతా చుట్టుకుని అదే జీవితానికి పరమార్థమని నమ్ముకున్నానో వాళ్ళు జీవించటం వ్యర్థం...

వెళ్ళిపోతున్నాను సుశీ ... వెళ్ళిపోతున్నాను ... నిన్ను విడిచి...ఈ లోకాన్ని విడిచి...పువ్వుల్ని, సుఖాల్ని, ఆనందాల్ని ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోతున్నాను. నా ప్రేమకు ఈ ఆగని కన్నీళ్ళు సాక్షి. నా పగులుతున్న గుండెలు, తెగుతున్న నరాలు, వణికిపోయే నా శరీరం– ఇవే సాక్షి...నేను నిన్ను ప్రేమిస్తున్నాను సుశీ...నిన్ను ప్రేమిస్తూ హాయిగా వెళ్ళిపోతున్నాను...

అదుగో...ఆ సీసాలో విషం...కాదు అమృతం... నా వ్యథని...ఈ బతుకు బరువుని తొలిగించి విముక్తి నిచ్చేది. ఒక్క–సారి లేచి నుంచున్నాను. గదంతా కలయ చూశాను. బయటి

కెళ్ళాను. అనంతమైన ఆకాశాన్ని చూశాను. కొన్ని కోట్ల చుక్కలు నన్ను పలకరించాయి. చీకట్లో పట్నంలోని మేడలు అందులో మినుకు మినుకు మంటున్న దీపాలు కన్పించాయి.

గదిలోకొచ్చి ఆసీసా తీసికొన్నాను. ఇంకొక్క నిమిషం... సుశీ ఒక్క నిమిషం...అమ్మ జ్ఞాపకంవచ్చింది...అమ్మ...నేను కోడల్ని తీసికొస్తానని...మనవల్ని కంట్నానని ఎదురుచూస్తుంది... నిమిషం అయిపోతోంది...ఇంక పదిసెకన్లు...తొమ్మిది...... ఆరు...రెండు...

కిందినుంచి కెవ్వున కేక...సీతారామయ్య పెద్దగా అరుస్తున్నాడు. ఆయన భార్య మహాలక్ష్మి ఏడుపు...

♦ ♦ ♦

గంట తర్వాత ఈ ఆఖరు పేజీ రాస్తున్నాను సుశీ. నేను క్రింద అరుపులు విని క్రిందకు పరుగెత్తాను. అక్కడ సీతా రామయ్య కంగారు పడుతున్నాడు ఆయన భార్య ప్రసవించింది. భార్యకి ఏదో ఫిట్‌లాంటిది వచ్చింది. 'నేను డాక్టరు దగ్గరి కెళ్ళొస్తాను. మీరు చూస్తూ ఉండండి' అన్నాడు. 'సరే'అన్నాను.

నేనక్కడ చూశాను సుశీ! అప్పుడే ఈలోకంలోకి ప్రభవించిన శిశువుని. తామరాకుల్లో పెట్టిన గులాబిలా ఉన్నాడు

చంలో కొచ్చాడు. ఈ పుష్పాల్ని,
శాన్ని ఈ సంధ్యల్ని అనుసరించటానికి
ళ్లో ఈదటానికి ఈ లోయలో తిరగటానికి
హాయిగా వేణువు వూదుకోటానికి, ఈ ప్రకృ
లసమవటానికి వచ్చాడు సుశీ...ఇప్పుడే వచ్చాడు...
నే చూశాను...నేనే ముందుచూశాను...తనో పేరుపెట్టుకుని
ళ్ళు...బతకటానికి...లోకంలో సుఖాన్ని ఆనందాన్ని
సాధించటానికి ఇప్పుడే ఓకొత్తమనిషి వచ్చాడు...

అతడు యా...యా...అంటూ అరుస్తున్నాడు. నేనూ ఈచల్లటి నేలమీద అడుగుపెట్టానోయ్ అని చెప్తున్నాడు. చిగురాకు చేతుల్లో పెనుగులాడుతున్నాడు. పూరేకుల పెదవుల్లో అమృతం తాగుతున్నాడు.

'కంగ్రాచులేషన్స్...విషంసక్సెస్...డాక్టరొచ్చేచ్చాడు. నేను పరుగెత్తుకొని పైకొచ్చేశాను.

నేను చావబోవటంలేదు. విషం సీసాని కిటికీలోంచి వీధిలోకి విసిరికొట్టాను. రోడ్డుమీద పెళపెళా పగిలిపోయింది.

తెలవారబోతోంది. ప్రత్యూషంలో
నృత్యం చేద్దామనిపిస్తోంది. ఒక్క వాక్య
చేస్తాను.

ఏదో ఒకనాడు నా పెళ్ళి శుభలేఖ నీకూ అందుతుం

శలవు.



'రామం.'

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPLA103B 102 |
| పుస్తకం పేరు | ఆఖరి ప్రేమ లేఖ |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI,8 ,BCI |
| లేని పేజీలు | 9-12 |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |